గోదాదేవి అనుగ్రహించిన

# తిరుప్పావై

## టీకా - తాత్పర్య - విశేషాలతో

టీకా తాత్పర్య రచయిత :

డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు



ప్రకాశకులు

# తిరుప్పావై - టీకా, తాత్పర్య విశేషాలతో

**టీకా తాత్పర్య రచయిత : డా॥ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యులు**

ముఖచిత్రం : గోదాదేవి

వెల :

ప్రతులు :

ముద్రణ :



# తిరుప్పావై అవతారిక

తమిళభాషాసాహిత్యమునందు నాలాయిర దివ్యప్రబంధముగా పేరు గాంచిన మధుర భక్తివాఙ్మయమును దివ్యసూరులు, ఆళ్వార్లు అను పేరుతో ప్రసిద్ధి చెందిన పన్నెండుమంది భక్తశిఖామణులు రచించిరి. వీరందఱును భగవానుడగు శ్రీమన్నారాయణుని నిర్హేతుక కరుణవలన భక్తిగా పరిణమించిన జ్ఞానాన్ని పొంది ఈ ప్రబంధములను రచించిరని పెద్దల సూక్తి. నాలాయిర దివ్యప్రబంధములలో ఒకటియగు తిరుప్పావైప్రబంధమును గోదాదేవి రచించినది. ఈమెకు తమిళమున "ఆణ్డాళ్" అని పేరు. ఈమె ఈ ప్రబంధమునే కాక నాచ్చియార్ తిరుమొழி అను వేఱొక మధుర కృతినికూడ వెలయించినది. సరోయోగి, శఠకోపయోగి మొదలైన దివ్యసూరులకు కుమార్తె (జ్ఞానసంతతి)గా కీర్తింపబడు ఈమె తన భగవద్భక్తి వైభవమున వారినికూడ మించినది. తులసివలె స్వాభావిక జ్ఞానభక్తిసౌరభ సమృద్ధ. అతిప్రబుద్ధుడగు భగవానునకు సైతము ప్రబోధమును పల్కిన పరమవిలక్షణమైన వ్యక్తిత్వమును కల్గినది. పురుషోత్తముడగు భగవానుని భక్తుడు తాను పురుషుడను భావనతో ఆరాధించుటకంటె, స్త్రీ భావనతో ఆరాధించుట విలక్షణమైనది. కావుననే పరాంకుశ పర కాలాది దివ్యసూరులు తమ కృతులలో అపుడపుడు తమయందు నాయకీభావనను ఆరోపించుకొని, భగవానుని స్తుతించిరి.గోదాదేవి సహజముగనే స్త్రీ యగుటచే ఆమె కట్టి స్త్రీత్వారోపణము అవసరము కాలేదు. అందుచే భగవానునిపట్ల ఈమె ప్రదర్శించిన మధురభక్తి మరింత సహజమైనది; మిగిలిన దివ్యసూరులందఱి భక్తికంటే గాఢమైనదియును. కావుననే వేదాంతదేశికులు గోదాస్తుతిలో– **"భోక్తుం తవ ప్రియతమం భవతీవ గోదే! భక్తిం నిజాం ప్రణయభావనయా గృణంతః, ఉచ్చావచైః విరహసంగమజై రుదంతైః శృంగారయంతి హృదయం గురవ స్త్వదీయాః"** అని పల్కిరి.

**గోదాదేవి చరిత్రసంగ్రహము :–** పూర్వము త్రేతాయుగమున విదేహదేశములో మిథిలానగరమున జనకచక్రవర్తి తాను తలపెట్టిన యజ్ఞనిర్వహణార్థము భూమిని దున్నుచుండగా నాగటిచాలులో లక్ష్మీదేవి సీతాదేవి రూపమున ఆవిర్భవించినట్లే, కలియుగములో పాండ్యమండలమునందలి శ్రీవిల్లిపుత్తూరులో శ్రీ భట్టనాథులు (పెరియాళ్వార్లు) పుష్పోద్యాన మున తులసీవనమును పెంచుటకై భూమిని తవ్వునపుడు భూదేవి చిన్న శిశువుగా ఆవిర్భవించెను. ఆమె ఆవిర్భావము కర్కటకమాసమున, పూర్వఫల్గునీ నక్షత్రమున సంభవించెను. ఆ శిశువును చూచిన నిస్సంతువగు భట్టనాథులు

ఆమె భగవానుడు తనకు ప్రసాదించిన సంతానముగా భావించి, ఆమెకు **"కోదై"** అని పేరు పెట్టెను. (ఈపేరు సంస్కృతభాషలో **"గోదా"** అని వ్యవహరింపబడు చున్నది). పరమానందముతో ఆమెను పెంచసాగెను. వయసుతోపాటు గోదాదేవికి భగవద్భక్తియు పెరుగజొచ్చెను. ఆమె భక్తి క్రమముగా పరభక్తి–పరజ్ఞాన–పరమభక్తులనెడి ఉచ్ఛదశలను చేరుకొన్నది. **"తమంతరేణ నైవాన్యం మనసాఽపి పతిం వృణే"** అనునట్లు భగవానుడగు శ్రీమన్నారాయణుని మాత్రమే భర్తగా వరింప నిశ్చయించుకొనెను. నిత్యము ఆ స్వామి వైభవమును స్మరించుచు, కీర్తించుచు కాలమును గడుపసాగెను.

ప్రతిదినము శ్రీవిల్లిపుత్తూరులో వెలసియున్న వటపత్రశాయి స్వామికి సమర్పించుటకై పూమాలికను కట్టుట భట్టనాథులకు అలవాటు. తన తండ్రి కట్టియుంచిన పూల మాలికలను రహస్యముగా తాను ధరించి, అద్దములో తన రూపమును చూచుకొనుచు, తనకు భగవానునకు అనురూపమైన సౌందర్యము ఉన్నదా? లేదా? అని గోదాదేవి పరిశీలించుకొను చుండెడిది. ఇట్లు ఆమె స్వామికి అర్పించుటకుముందే పూమాలికలను ధరించుట భట్టనాథులకు తెలియదు. ఆ మాలికనే ఆయన వటపత్రశాయి స్వామికి సమర్పించుచుండెను. ఇట్లు చాల కాలము గడిచెను. ఒకనాడు తాను స్వామికై సిద్ధము చేసియుంచిన మాలికలను గోదాదేవి ముందుగనే తలలో ధరించుటను చూచిన భట్టనాథులు ఆమెపై మిక్కిలి కోపించి, "అయ్యో! ఎంత పని చేసితివి? భగవానునకు అర్పింపదగిన మాలికలను నీవు ముందుగా దాల్చితివే! ఈ విధముగా నిత్యము చేయు చున్నావా ఏమి? ఎంత అపచారము జరిగినది!" అని పల్కి చాలా బాధపడి, ఆ దినమున వటపత్రశాయికి పూమాలికలను సమర్పింపలేదు. ప్రతిదినము తాను చేయుచున్న పుష్పమాలికా సమర్పణకైంకర్యమును ఆ నాడు చేయలేకపోయితినే! అను బాధతో తపించు భట్టనాథులకు ఆ నాటి రాత్రి వటపత్రశాయి స్వామి కలలో కనుపించి – "భట్టనాథా! ఎందుల కీనాడు నీవు పూమాలి కలను సమర్పింపలేదు?" అని ప్రశ్నించెను. అపుడు భట్టనాథులు జరిగిన సంగతిని నివేదించుచు,"స్వామీ! చాలకాలముగా నాకు తెలియకనే నేను ఉచ్ఛిష్టమైన మాలికలను సమర్పించుచుంటిని. నా ఈ అపరాధము మన్నింపుము" అని వేడెను. అపుడు స్వామి "ఓయీ! గోదాదేవి ముడుచుకొని విడచిన మాలికలే నాకు మిక్కిలి ఆనందదాయకము సుమా! నీవు సంకోచింపక, ప్రతిదినము పూర్వమువలెనే గోదాదేవి అలంకరించుకొనిన పూమాలికలనే నాకు అర్పింపుము" అని ఆదేశించి, అంతర్ధానమయ్యెను.

నిద్రనుండి లేచిన భట్టనాథులు గోదాదేవి సామాన్యురాలు కాదని, సాక్షాత్తు దివ్యమైన అంశతో జన్మించిన మహనీయురాలని గుర్తించి, అప్పటినుండి ఆమెపట్ల



మఱింత గౌరవముతో, అనురాగముతో ప్రవర్తించుచు, భగవానుడాదేశించినట్లే గోదాదేవి ముడుచు కొని తీసియుంచిన మాలికలను సమర్పింపసాగెను. దీనివలన గోదాదేవికి **"శూడిక్కొడుత్త నాచ్చియార్" (స్వోచ్ఛిష్టమాల్యదాత్రీ – ఆముక్తమాల్యదా)** అను పేరు కలిగినది. ఇట్లు గోదాదేవికి ముందు మాలికలను అర్పించి, పిమ్మట వటపత్రశాయి భగవానునకు సమర్పించు ఆచారము ఈ నాటికిని శ్రీవిల్లిపుత్తూరు దివ్యక్షేత్రములో ఆచరణలోనున్నది.

క్రమముగా గోదాదేవి వివాహమునకు తగిన వయస్సును పొందెను. ఆమెకు గల జ్ఞాన–భక్తి–వైరాగ్యములను, భగవానునియందు గల అనన్యమైన అనురాగమును చూచిన భట్టనాథులు, **"పతిసంయోగసులభం వయో దృష్ట్వా చ మే పితా, చింతార్ణవగతః పారం నాససాదాప్లవో యథా"** అని జనకచక్రవర్తి, సీతాదేవి వివాహవిషయములోవలె, గోదాదేవి వివాహవిషయమునందు చింతాక్రాంతు లయ్యెను. భగవానుని తప్ప వేఱొకనిని పరిణయ మాడదనెడి ఆమె సంకల్పము ఎట్లు ఫలించునోకదా! – అను ఆలోచన భట్టనాథులకు అధికము కాసాగెను. ఇక, గోదాదేవి విషయమును గమనించినచో, ఆమెకు గల భగవత్ప్రేమ దినదినము ఉత్కటము కాజొచ్చెను. ఆ ప్రేమ ప్రవాహముయొక్క పరిణామ రూపముగా ఆమె రెండు దివ్యప్రబంధములను విరచించి, లోకమునకు అందించినది. అవి ఏమనగా– తిరుప్పావై, నాచ్చియార్ తిరుమొళి అనునవి. ఒకనాడు భట్టనాథులు గోదాదేవిని పిలిచి, "అమ్మా! నీవు ఎవరిని వివాహమాడగోరుచున్నావు?" అని అడుగగా, ఆమె భగవానుని తప్ప వేఱొకనిని వివాహమాడనని పల్కెను. అపుడు భట్టనాథులు 108 విష్ణుక్షేత్రములలోని ఏ స్వామిని పరిణయమాడెదవని మరల ప్రశ్నింపగా, ఆయా క్షేత్రములలోని అర్చామూర్తుల వైభవమును తనకు తెలుపవలసినదిగా గోదాదేవి తన తండ్రిని ప్రార్థించెను. భట్టనాథు లును వరుసగా అన్ని శ్రీవైష్ణవ క్షేత్రములలోని భగవన్మూర్తుల మహిమనుగూర్చి ఆమెకు తెలిపిరి. అపుడు గోదాదేవి శ్రీరంగములో వెలసియున్న శ్రీరంగనాథుని వివాహము చేసికొందుననుచు తన నిర్ణయమును భట్టనాథులకు తెలియజేసెను. ఆమెకు తగిన వరుడు శ్రీరంగనాథుడే అని విష్ణుచిత్తులు నిశ్చయించుకొనిరి. కాని, గోదాదేవి అర్చామూర్తి యగు శ్రీరంగనాథుని వివాహము చేసికొనుట ఎట్లు సాధ్యమో తెలియక విచారముగా ఆనాటి రాత్రి భట్టనాథులు నిద్రింపగా, శ్రీరంగనాథుడు స్వప్నములో సాక్షాత్కరించి – "భట్టనాథా! మీరు విచారింపకుడు. మీరు గోదాదేవిని తీసికొని శ్రీరంగమునకు రండు. నేనామెను వివాహమాడెదను" అని పల్కి, అంతర్ధానమయ్యెను. అట్లే, ఛత్రచామరాది మర్యాదలతో గోదాదేవిని తీసికొనిరావలసినదిగా శ్రీరంగనాథుడు శ్రీరంగాలయార్చకులను

ఆజ్ఞాపించెను. వారును సకలమర్యాదలను గైకొని శ్రీవిల్లిపుత్తూరు నకు పోయి, శ్రీరంగనాథుని ఆజ్ఞను భట్టనాథులకు తెలుపగా, ఆయనకూడ పరమ సంతోషముతో అంగీకరించెను. గోదాదేవిని వెంట నిడికొని, అందఱు ఛత్రచామరాది మర్యాదలతో శ్రీరంగమును చేరిరి. గోదాదేవి శ్రీరంగనాథుని దరిచేరి, ఆ మూర్తికి పాదసంవాహనము చేయుచు అంతర్ధాన మందెను. భట్టనాథులు, ఆ దేశప్రభువు, అర్చకులు మొదలగు వారందఱును ఆ దృశ్యమును చూచి మిక్కిలి ఆశ్చర్య పడిరి. భట్టనాథులకు శ్రీరంగనాథుడు విశేషముగా సమ్మానము చేసి, యథా పూర్వము శ్రీవిల్లిపుత్తూరునకు చేరి, అచట పుష్పమాలికాకైంకర్యమును చేసికొన వలసినదిగా తెలిపెను. భట్టనాథులును శ్రీవిల్లిపుత్తూరులో వటపత్రశాయి స్వామికి సేవచేసికొనుచు కాలము గడపి చివరకు భగవదనుగ్రహముతో పరమపదమును చేరిరి. ఇది సంగ్రహముగా గోదాదేవిచరిత్ర.

**తిరుప్పావైప్రబంధ వైశిష్ట్యము :- "పావై"** అనగా వ్రతము. **"తిరుప్పావై"** అనగా శ్రీవ్రతము – అనగా మంగళకరమైన వ్రతము. మార్గశీర్షవ్రతము అను ఒక నెపముతో శ్రీకృష్ణుని సన్నిధికి చేరి, "నీకు శేషమైయున్న ఈ ఆత్మ అనర్థము చెందకుండునట్లు రక్షించి, ఆత్మస్వరూపమునకు తగిన నీ కైంకర్యమును నీవు ప్రసాదింపవలెను. ఆ సేవయు యావదాత్మ భావియగునట్లు అనుగ్రహింపవలెను" – అని ప్రార్థించుటయే ఈ వ్రతము యొక్క పరమార్థము. ఇక, ఈ వ్రతమునకు మూలమేమి? అని విచారించినచో, మీ మాంసాశాస్త్రమున హోళాధికరణమున తెలుపబడిన హోళోత్సవమువలె ఇదియును శిష్టాచార సిద్ధము. హోళోత్సవము అనగా వసంతోత్సవము. ఫాల్గున మాసములో పౌర్ణమికి పిమ్మట వచ్చు పాడ్యమీ తిథియందు ఆచరింపబడు ఉత్సవమిది. ఈ ఉత్సవములో పసుపుతో కలిపిన జలము (వసంతము) ఒకరిపై వేఱొకరు జల్లుకొనుచు ఆనందింతురు. ఈ ఉత్సవము శ్రుతిస్మృతివిహితము కాకున్నను, **"స్మృతిశీలే చ తద్విదామ్, ఆచారశ్చైవ సాధూనామ్"** అని, **"ధర్మజ్ఞసమయః ప్రమాణమ్"** అని ఇత్యాదిగా తెలుపబడిన శిష్టాచార ముచే ప్రసిద్ధము; కావున ఆచరణీయము. అట్లే, మార్గశీర్షవ్రతము (తిరుప్పావై) కూడ శ్రుతిస్మృతిప్రోక్తము కాకున్నను, ద్వాపరయుగమున గోపికలు ఆచరించిన వ్రతము కావున, పరమభక్తురాండ్రగు గోపికల అనుష్ఠానము పరమప్రమాణము కావున, ఈ వ్రతము ఆచరణీయమగుటలో సందేహము లేదు. **"హేమంతే ప్రథమే మాసి నందవ్రజకుమారికాః, చేరుః హవిష్యం భుంజానాః కాత్యాయన్యర్చనవ్రతమ్"** అనునట్లు రేపల్లెలోని గోపికలు శ్రీకృష్ణ సంశ్లేషమును గోరి హేమంతఋతువులోని మొదటినెల అగు మార్గశీర్షములో కాత్యాయ నీవ్రతమును ఆచరించిరి. **"ఇతి చైవ యథా చక్రుః ప్రపన్నా గోపికాస్త్రియః,**



**ధనుర్మాసవ్రతం గోదా తథైవ భగవత్పరా, రంగేశం పూజయామాస విధినా నియతవ్రతా"** అను రీతిలో గోదాదేవి తనను ఒక గోపికగా భావించి గోపికల కాత్యాయనీవ్రతమును అనుసరించుచు ఈ ధనుర్మాసవ్రతమును, అనగా – తిరుప్పావైను ఆచరించినది.

శ్రీకృష్ణసంశ్లేషమును అభిలషించిన గోదాదేవి ఆ విషయమును స్పష్టముగా పలుకక, ధనుర్మాసవ్రతమును నోచుటవలన సుభిక్షమగును, కావున ఆ వ్రతమును నోచుచున్నా మనుట అసత్యమాడుటయేకదా! ప్రతారణమే యగును కదా! అది తగునా? అను ప్రశ్నకు విజ్ఞులగు ఆచార్యులు ఇట్లు సమాధానమిచ్చిరి. **"వారిజాక్షులందు వైవాహికములందు ప్రాణవిత్తమాన భంగమందు, చకితగోకులాగ్ర జన్మరక్షణమందు, బొంకవచ్చు నఘము వొంద దధిప!"** అను రీతిలో ప్రాణాపాయస్థితిలో అసత్యమాడుటలో తప్పులేదు కదా! పరమభక్తశిఖామణులగు భట్టనాథుల కుమార్తెగా పెరుగుటచేత, భూదేవి అంశచే జన్మించిన దగుటచేతను గోదాదేవియొక్క జ్ఞానము, భక్తియు పరమ విలక్షణములైనవి. ఆమె భక్తి పరభక్తి– పరజ్ఞాన–పరమభక్తులనబడు ఉచ్చదశను చేరుకొని, భగవానుని చేరినగాని తాళ లేని స్థితిని పొందినది. ఇక ఆలస్యమైనచో ప్రాణవియోగము కల్గునట్టి స్థితి ఆమెకు ఏర్పడుటచే, ప్రాణములను నిల్పుకొనుటకై తగిన ఉపాయమేదైన ఉన్నదా? అని విచారించి నది. పూర్వము రేపల్లెలోని గోపికలు తమకు శ్రీకృష్ణవియోగము కల్గినపుడు తమ ఆర్తిని, దుఃఖమును మఱచి జీవించియుండుటకై శ్రీకృష్ణుని అనుకరించుచు, అతని లీలలను అనుసంధించిరని పెద్దలవలన, గోదాదేవి వినియుండుటచే, తానుకూడ గోపికలను అనుకరించుచు,వారు ఆచరించిన మార్గశీర్ష వ్రతమును కృష్ణుని విషయమున ఆచరించి నచో ఆస్వామి అనుగ్రహమును పొందవచ్చునని తలచినది.

బ్రాహ్మణకులమునకు చెందిన గోదాదేవి గోపికలను అనుకరించుట, పల్కుట ఎట్లు తగును? అనినచో, యాగదీక్షను స్వీకరించినవారు యాగసమయమున తమకు పూర్వముగల దేవదత్తాదినామధేయములతోకాక, **"అధ్వర్యు, హోత, ఉద్గాత, యజమానుడు"** మొదలగు పేర్లతో పిలువబడునట్లే, గోదాదేవియు శ్రీవిల్లిపుత్తూరును వ్రేపల్లెగా, అచటి కన్యలను రేపల్లెలోని గోపకన్యకలుగా, తనను వారిలో ఒకతెగా, వటపత్రశాయి స్వామి ఆలయమును నందగోపాలుని భవనముగా, ఆలయములోని స్వామిని శ్రీకృష్ణునిగా తలచినదగుటచే, ఆమె తనను రేపల్లెలో ఉన్నట్లుగానే భావించినది. ఆ భావనాతిశయముచే ఆమె అనుకరణ సంపూర్ణతను చెంది, గోపికలు మాటలాడినట్లు, ప్రవర్తించినట్లును మాటలాడుట, ప్రవర్తించుటయు సంభవించినది. ఇక, ఇపుడు గోదాదేవి ఆదరించిన మార్గశీర్షవ్రత పూర్వరంగమును గమనించెదము.

భగవానుడు శ్రీకృష్ణుడుగా అవతరించి రేపల్లెలో పెరుగుచున్న సమయమున, శ్రీ కృష్ణుని దివ్యరూపమునకు, అతిమానుషలీలలకును అత్యంతము ఆకృష్టమనస్కలైన గోపికలు ఆ స్వామిని దర్శింపగోరిరి. కాని, గోపవృద్ధులందఱు "శ్రీకృష్ణుడు ధూర్తుడు; అతని కంట గోపికలు పడుట తగదు" అని తలచి వారిని శ్రీకృష్ణునివద్దకు పోకుండ అడ్డుపెట్టిరి. ఈ విధముగా శ్రీకృష్ణుని దర్శింపవలెనను గోపికల ఆశ, గోపికలను అనుగ్రహింపవలెనను శ్రీకృష్ణుని అభీష్టమును తీరలేదు. ఇంతలో దైవవశమున వ్రేపల్లెలో అనావృష్టి సంభవించెను. అపుడు గోపికలు – "గోధనులైన గోపాలురు వర్షముకొఱకు మనలను వ్రతముచేయుడని తప్పక పలుకగలరు. ఆ వ్రతమునకు నిర్వాహకునిగా శ్రీకృష్ణుని చేయగలరు. కావున మనము శ్రీకృష్ణుని దర్శింప అవకాశము కలుగగలదు" అని తమలో తాము ఓదార్పును పొందిరి. వారు తలంచిన రీతిలోనే రేపల్లెలోని గోపవృద్ధులు కలిసి "అనావృష్టిని నివారించు ఉపాయమేమైన కలదా?" అని విచారించి, వర్షముకొఱకు నోము నోచిన సువృష్టి కలుగును; పశువులు, మనుష్యులు సుఖముగా జీవింపగలరని తలచి, గోపకన్యకలు ఆ వ్రతమును ఆచరింపవలెనని, అందులకు శ్రీకృష్ణుడు ఘటకుడుగా ఉండవలె ననియు నిశ్చయించిరి. శ్రీకృష్ణునకు ఈ విషయమును తెలిపి, గోపికలను పిలచి వారిని శ్రీకృష్ణునకు అప్పగించి, గోపవృద్ధులు వెడలిపోయిరి. అపుడు శ్రీకృష్ణుడు గోపికలతో – "గోపకన్యకలారా! మీరు తెల్లవారుజాముననే లేచి, నా వద్దకు రండు. మనమందఱము అపుడు వ్రతముకొఱకు స్నానము చేయుదము" అని పల్కి, నీళాదేవి గృహమును చేరెను.

గోపికలు తమ తమ ఇండ్లకు చేరి, నిద్రింపబోయిరి, కాని, శ్రీకృష్ణునితో కలిసెడి శుభవేళ ఎపుడు వచ్చునోకదా! అను ఆతురతవలన వారికి ఆ రాత్రి నిదురరాలేదు. ముందుగా లేచిన గోపికలు, శ్రీకృష్ణుని గుణములను, లీలలను అనుసంధించు తమ సహచరగోపికలకు ప్రబోధమును పల్కిరి. వారితో అందరితో కలసి నందగోపమందిర మును చేరి, శ్రీకృష్ణునకు సుప్రభాతమును పల్కి, తమ అభీష్టమును ఆ స్వామికి నివేదించిరి. ఇది తిరుప్పావై ప్రబంధమున మనకు గోచరించు వ్రతక్రమము.

ఇక, చివరిగా వేఱొక విషయము. ఈ గోపికలు ఆచరించు వ్రతము ఒక నెపముమాత్రమే అయినచో, వీరికి అనుద్దేశ్యమైన వర్షమును పర్జన్యుడు కురిపించునా? – అనినచో, "వ్రతోపవాసముచే కృశించిన మమ్ములను చూచిన పర్జన్యుడు చైతన్యమును కల్గినవాడగుటచే, మాపై దయచూపి తప్పక వర్షించును" అని గోపికలు తలచిరి. మరియు, గోపికలు వ్రతము ఆచరించుటలో ప్రధాన ఉద్దేశ్యము శ్రీకృష్ణసంశ్లేషమే అయినను, వృష్టి అప్రధానమైనను, వీరిని ఈ వ్రతమును చేయుడని ఆజ్ఞాపించిన గోపవృద్ధులకు వర్షము ఉద్దేశ్యమగుటచే, వారి ఉద్దేశ్యము సిద్ధించినగాని వ్రతము ఫలవంతము కాదు. కావున పరమభక్తురాండ్రగు గోపికలు ఆచరించు వ్రతము నిష్ఫలమగుటకు పర్జన్యుడును అంగీకరింపడు. అందుచే వారు ఆశించిన శ్రీకృష్ణసంశ్లేషము కలుగవలెనన్న వ్రతము ఫలపర్యవసాయి కావలసి యున్నందున, గోపికలు ఆశించిన కృష్ణసంశ్లేషము కల్గుటకై, గోపవృద్ధులు కోరిన వర్షమును పర్జన్యుడు తప్పక కురిపించు ననుటలో సందేహము లేదు.



ఇక, ఈ ప్రబంధములో **"నీరాడ"** అనుచు పలు చోట్ల ప్రస్తావింపబడిన స్నానము యొక్క పరమార్థమేమి? అను విషయము తత్త్వదృష్టిలో విమర్శింపదగినది. ఇచట గోదాదేవి ప్రస్తావించిన స్నానమునకు వ్రతముకొఱకు చేయు స్నానమను అర్థము పైపైకి స్ఫురించు అర్థమైనను, అంతకంటే విశిష్టమైన, మనోహరమైన ధ్వన్యర్థ మిచట వివక్షితము. శ్రీకృష్ణుని విరహముచే కల్గిన సంతాపమంతయు తీర్చు ఆ భగవానుని సంశ్లేషమే ఈ పదముచే ఉద్దిష్టమైన అర్థము. తమిళ ఆలంకారిక సంప్రదాయాను సారముగా కూడ నాయికా నాయకుల సంశ్లేషము **"శునైయాడల్"** (సరః స్నానము) గా తెలుపబడినది. ఈ క్రమమును అనుసరించుచు గోదాదేవి తిరుప్పావై ప్రబంధములో శ్రీకృష్ణానుభవమును **"నీరాట్టమ్"** (స్నానము) గా నిర్దేశించిరని అభిజ్ఞులగు ఆచార్యుల వివరణము. భగవానుని చల్లని తటాకముగా భావించుట **"ఏష బ్రహ్మ ప్రవిష్టోఽస్మి గ్రీష్మే శీతమివ హ్రదమ్"** (గ్రీష్మమున చల్లని తటాకములోవలె, నేను ఈ పరబ్రహ్మను ప్రవేశించితిని) ఇత్యాది ఉపబృంహణ ప్రమాణములందు, **"తామరైనీళ్ వాశత్తడమ్పోల్ వరువానే"** అని, **"కరచరణసరోజే కాంతిమన్నేత్రమీనే...... హరిసరసి"** అని, **"ఉత్ఫుల్లపంకజతటాక మివోపయాని శ్రీరంగరాజమిహ"** అని, **"పిబ! నయన పురస్తే రంగధుర్యాభిధానం స్థితమివ పరిఫుల్లత్ పుండరీకం తటాకమ్"** అనియు ఇత్యాదిగాగల ఆచార్య, దివ్యసూరి సూక్తులయందును కాననగును. భక్తుల మనస్సులను చల్లబఱచు కృప, వాత్సల్య, సౌశీల్య, సౌలభ్యాది గుణవిశిష్టుడైన భగవానుని చల్లని సరస్సుగా భావించుట యుక్తమే కదా! ఇట్టి భావనతోనే గోదాదేవి శ్రీకృష్ణసంశ్లేషము నిచట నీరాట్టముగా పల్కినది.

ఈవిధమైన ధ్వన్యర్థస్ఫూర్తిని తిరుప్పావైప్రబంధములోని అన్ని పాశురములలో పలు ప్రయోగములందు గమనింపవచ్చును. ఇట్టి ధ్వన్యర్థములకే శ్రీవైష్ణవసంప్రదాయమున స్వాపదేశార్థములని పేరు. తిరుప్పావై ప్రబంధములోని అలంకారమునుగూర్చి చర్చించుచు మహావిద్వాన్ ప్రతివాది భయంకరం అణ్ణంగరాచార్యస్వామివారు (కాంచీ) ఇట్లు నుడివిరి– "అలంకారశాస్త్రమున రూపకాతిశయోక్తి అను ఒకానొక అలంకారము కలదు". **"పశ్య**

**నీలోత్పలద్వంద్వాత్ నిస్సరంతి శితాశ్శరాః"** అనునది దీని ఉదాహరణము. అనగా – నల్లకలువల జంటనుండి పదునైన బాణములు వెలువడుచున్నవి చూడుము – అని దీని అర్థము. ప్రేయసి నేత్రద్వయమునుండి వెలువడు కటాక్షములనుగూర్చి ఆమె ప్రియుడు పల్కిన ఉక్తి ఇది. తిరుప్పావై ప్రబంధమునందు అంతట ఈ అలంకారమును సమన్వ యింప వీలగును. అట్లే, ఇచ్చట అప్రస్తుతప్రశంస, ప్రస్తుతాంకురము, ముద్రా, సమాసోక్తి అను అలంకారముల సమన్వయమునుగూర్చి, గమనించెదము. **"అప్రస్తుతప్రశంసా స్యాత్ సా యత్ర ప్రస్తుతానుగా"** అనగా – ప్రకృతమైన ఒకానొక విషయముయొక్క స్ఫూర్తి కొఱకు అప్రస్తుతమైన వేఱొక విషయముయొక్క కథనమే ఈ అలంకార లక్షణము. దీనిని ప్రకృతమున కొన్ని గాథలలో మాత్రము సమన్వయింప వీలున్నది. కాని, ఇంతకంటే ప్రస్తుతాంకురాద్యలంకారయోజనము సుశకము. **"ప్రస్తుతేన ప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాంకురః"** అనునది ప్రస్తుతాంకురాలంకార లక్షణము. సుస్పష్టముగా తెలుపబడు వాచ్యార్థము, వ్యంగ్యరూపమున భాసించు ధ్వన్యర్థము – రెండును ప్రకృతార్థములే అయినచో అది ప్రస్తుతాంకురాలంకార మనబడును. ఈ అలంకార ప్రక్రియలోనే ప్రకృత ప్రబంధము లోని పాశురములన్నియు కలవనుట మిక్కిలి యుక్తము. ఇందులకు మొదటి పాశురమే ఒక చక్కని ఉదాహరణము. **"సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽ ప్రస్తుతస్య చేత్"** – ప్రస్తుత మగు ఒకానొక విషయము వర్ణింపబడినపుడు, దానివలన అప్రస్తుతమైన వేఱొక వృత్తాం తము స్ఫురించుట – అను సమాసోక్తి అలంకారప్రసక్తి ఈ ప్రబంధమున కలదనుటకు వీలు లేదు. ఎందులకనగా స్వాపదేశార్థములుగా చెప్పబడు ధ్వన్యర్థములన్నియు ప్రధానము లే కదా! **"సూచ్యార్థసూచనం ముద్రా ప్రకృతార్థపరైః పదైః"** – ప్రకృతార్థమును తెల్పుపదముల ద్వారా సూచింపగోరిన అర్థమును సూచించుట ముద్రా లంకారము – అను లక్షణమును కల ముద్రాలంకారముకూడ ఈ ప్రబంధమున మిక్కిలి సమన్వయించును.

ఈ ప్రబంధములోని వాచ్యార్థముల గౌరవముకంటె ధ్వన్యర్థముల గౌరవము అతిశయించి యున్నదనుటను ఇందలి పలు ప్రయోగములు తెలుపుచున్నవి. ఈ ప్రబంధములోని ఏడవ పాశురములో **"పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో"** (పలికిన మాటలోని ధ్వనిని నీవు వినలేదా) అని ప్రయోగింపబడినది. నిజమునకు "పల్కిన మాటను నీవు వినలేదా?" అని పల్కిన మాత్రముననే సరిపోవు చుండగా "మాటలోని ధ్వనిని నీవు వినలేదా" అని పల్కుటలోని ఆంతర్యము ఏమి? అని గమనింప వలసియున్నది కదా! కేవలము మాటను వినుటతో సరి కాదు. అందు ధ్వనించు



అర్థవిశేషణములను గ్రహించి, ఆనందింపవలెననికదా ఈ ప్రయోగము లోని పరమార్థము! కావున గోదాదేవి స్వయముగా తాను పాడిన తిరుప్పావై ప్రబంధము ధ్వన్యర్థ ప్రధానమనుటను తెల్పినది. మహనీయుల సూక్తులన్నియు అట్టివేకదా! అందుచే తిరుప్పావై ఉత్తమోత్తమ కావ్యమనుటలో సందేహము లేదు. ఈ ప్రబంధమునకు శ్రీకృష్ణసూరి (పెరియవాచ్చాన్‌పిళ్ళై) రచించిన మువాయిరప్పడి వ్యాఖ్య, సుందరజామాతృవరులు (నాయనార్) రచించిన ఆఱాయిరప్పడి వ్యాఖ్య, జనన్యాచార్యులు (ఆయ్) అను పూర్వులైన ఆచార్యులు సంతరించిన ఈఱాయిరప్పడి వ్యాఖ్య, నాలాయిరప్పడి వ్యాఖ్య అని నాల్గు కలవు. సమీపకాలమున మహావిద్వాన్, కాంచీ అణ్ణంగరాచార్యస్వామివారు మొదలగు మహనీయులు పలువురు పలు భాషలలో వ్యాఖ్యానములను వ్రాసిరి. వీనిలో తెనుగున శ్రీ తె.కం.గోపాలాచార్య స్వామివారు, శ్రీభాష్యం అప్పలాచార్య స్వామివారు రచించిన వ్యాఖ్యలు మిక్కిలి ప్రసిద్ధి గాంచినవి. ఈ వ్యాఖ్యలలో పలు ధ్వన్యర్థములు వివరింపబడినవి. ఈ ప్రబంధమునకు పలు భాషలలో అనువాదములును వెలసినవి. ఇంకనూ వెలువడుచున్నవి.

* * *

## గోదాదేవీ ప్రార్థన (తిరుప్పావై తనియన్‌లు)

1. **నీళాతుఙ్గ స్తనగిరితటీసుప్త ముద్బోధ్య కృష్ణం**
**పారార్థ్యం స్వం శ్రుతిశతశిరస్సిద్ధ మధ్యాపయంతీ ।**
**స్వోచ్ఛిష్టాయాం స్రజి నిగళితం యా బలాత్కృత్య భుంక్తే**
**గోదా తస్యై నమ ఇదమిదం భూయ ఏవాస్తు భూయః ॥**

నీళా = నీళాదేవియొక్క, తుఙ్గ = ఉన్నములైన, స్తన = స్తనములనెడి, గిరి= కొండల యొక్క తటీ = తటప్రదేశములందు (చరియలయందు), సుప్తమ్= నిదురించిన, కృష్ణమ్= శ్రీకృష్ణుని, ఉద్బోధ్య = నిద్రలేపి, స్వమ్ = తనయొక్క శ్రుతిశత = వందలకొలది వేదవాక్యముల యొక్క, శిరః = శిరస్సులయందు (పలు వేదాంతవాక్యములందు), సిద్ధమ్= ప్రసిద్ధమైయున్న, పారార్థ్యమ్ = పరార్థతను (భగవత్ పారతంత్ర్యమును), అధ్యాపయంతీ= నేర్పుచున్నదై, స్వ = తనచేత, ఉచ్ఛిష్టాయామ్ = అలంకరించుకొని విడువబడిన, స్రజి = పూమాలలయందు, నిగళితమ్ = కట్టబడిన శ్రీకృష్ణుని, బలాత్కృత్య = బలాత్కరించి (నిర్బంధించి), యా గోదా = ఏ గోదాదేవి, భుంక్తే = అనుభవించెనో, తస్యై = ఆ గోదా దేవి కొఱకు, ఇదమ్ ఇదమ్ = ఈ ఈ, నమః = నమస్కారము, అస్తు= అగుగాక, భూయః ఏవ భూయః = మరల మరల, అస్తు = అగుగాక!

నీళాదేవియొక్క ఉన్నతస్తనములనెడి పర్వతముల చరియలలో నిద్రించిన (గోదాదేవి జ్ఞానభక్తులకు వశుడైన) శ్రీకృష్ణుని నిదురలేపి, పలు వేదాంత వాక్యములచే ప్రతిపాదింపబడిన జీవుని భగవత్పారతంత్ర్యమును ఆ స్వామికి తెలియజేసి, తాను ముడుచుకొని విడచిన పూమాలికతో అతనిని ఆకర్షించి, ఆ స్వామిని పొందిన గోదాదేవికి పలుమార్లు నమస్కరించెదను.

**2. అన్న వయల్ పుదువై ఆణ్డాళ్, అరఙ్గఱ్కు**
**ప్పన్ను తిరుప్పావై ప్పల్పదియమ్, - ఇన్నిశైయాల్**
**పాడి క్కొడుత్తాళ్ నఱ్పామాలై, పూమాలై**
**శూడి క్కొడుత్తాళై చ్చొల్లు**

అన్నమ్ = హంసలు నడయాడు, వయల్ = సస్యక్షేత్రములు కల, పుదువై = శ్రీవిల్లిపుత్తూరులో జన్మించిన, ఆణ్డాళ్ = ఆణ్డాళ్ అను పేరును గల్గినది, పన్ను = విమర్శించి అనుగ్రహింపబడిన, పల్ పదియమ్ = అనేక పద్యములను (పాశురములను కల్గినదై), నల్ = విలక్షణమైన, పా = పాటలయొక్క, మాలై = సందర్భ (మాల) రూపమైనదియగు, తిరుప్పావై = తిరుప్పావై అను దివ్యప్రబంధమును, అరఙ్గఱ్కు = శ్రీరంగనాథునకు, ఇన్ = శ్రావ్యమైన, ఇశైయాల్ = గానముతో, పాడి = పాడి, కొడుత్తాళ్ = సమర్పించినది, పూమాలై = పూలమాలికను,శూడి = (ముందుగా తాను) అలంకరించుకొని, కొడుత్తాళై = పిమ్మట (వటపత్రశాయి స్వామికి) అర్పించినదియు అగు గోదాదేవినిగూర్చి, శొల్ = పల్కుము.

హంసలు సంచరించు పొలములను కల శ్రీవిల్లిపుత్తూరు అను క్షేత్రములో పుట్టిన గోదాదేవి, నిత్యానుసంధేయము, పలు పాశురములను కల్గినది, విలక్షణములైన పాటల రూపములోనున్నది అగు తిరుప్పావై దివ్యప్రబంధమును రచించి శ్రీరంగనాథునకు సమర్పించుటయేగాక, తాను ముందుగా ధరించిన పూమాలికను శ్రీవిల్లిపుత్తూరులోని వటపత్రశాయిస్వామికి సమర్పించినది. అట్టి గోదాదేవియొక్క శుభ నామమును ఓ మనసా! అనుసంధింపుము.

**3. శూడి క్కొడుత్త శుడర్ కొడియే! తొల్పావై**
**పాడి యరుళవల్ల పల్ వళైయాయ్!, - నాడి నీ**
**వేఙ్గడవఱ్కు ఎన్నై విది ఎన్ఱ ఇమ్మాట్రమ్**
**నాఙ్గడవా వణ్ణమే నల్గు.**



శూడి = పూమాలికను అలంకరించుకొని, కొడుత్త = (పిమ్మట) వటపత్రశాయి స్వామికి అర్పించిన, శుడర్ = ప్రకాశించు, కొడియే = బంగారు తీగవంటిదానా!, తొల్ = అనాదియగు, పావై = తిరుప్పావై అను ప్రబంధమును, పాడి = కీర్తించి, అరుళ వల్ల = కృపచేయ సమర్థురాలైన, పల్ = నానా విధములైన, వళైయాయ్= కంకణములను కల్గినదానా! నీ = నీవు, నాడి = మన్మథుని దరిచేరి, (ఓ కామదేవా!), వేఙ్గడవఱ్కు = శ్రీవేంకటేశ్వరునకు, ఎన్నై = నన్ను, విది = (నాయకిని అగునట్లు) విధింపుము, ఎన్ఱ = అని పల్కిన, ఇమ్మాట్రమ్ = ఈ పాశురమును (సూక్తిని), నామ్=మేము, కడవా వణ్ణమ్ = అతిక్రమింపకుండు రీతిలో, నల్కు = అనుగ్రహింపుము

పూమాలికను తాను ముందుగా అలంకరించుకొని, పిమ్మట ఆ మాలికను వటపత్రశాయిస్వామికి అర్పించిన, ప్రకాశించు బంగారుతీగవంటి ఓ గోదాదేవీ! అనాదియైన వ్రతమును తిరుప్పావై ప్రబంధముగా గానము చేసిన, పలు కంకణములను దాల్చిన తల్లీ! నీవు కామదేవుని ఉద్దేశించి **"నీవు తగిన ఉపాయమును వెదకి, నేను శ్రీ వేంకటేశ్వరునకు పత్నియగునట్లు చేయుము"** అని ప్రార్థించిన తీరును మేమును దాటకుండునట్లు, నీకు గల అతిమాత్ర భగవత్ప్రావణ్యము మాకును కల్గునట్లును అనుగ్రహింపుము.

గోదాదేవిని స్తుతించు పై శ్లోకమును, పాశురద్వయమును తిరుప్పావై ప్రబంధము అనుసంధించుకొనుటకు ముందు చెప్పుకొనుట పెద్దలు ఆచరించుక్రమము. ఇకపై క్రమముగా తిరుప్పావై ప్రబంధములోని ఒక్కొక్క పాశురము, ఆ పాశురముల ప్రతిపదార్థతాత్పర్యములు, కొన్ని ధ్వన్యర్థములును నివేదింపబడుచున్నవి.

**మొదటి పాశురము :** తాము ఆచరించు మార్గశీర్ష వ్రతమునకు కాలము అనుకూలించుటచే, ఆ కాలమును గోపికలు ఇందు కొనియాడుచున్నారు. ఈ ప్రబంధములో ప్రతిపాదింపబడు ప్రాప్య, ప్రాపకములు ఈ మొదటి పాశురములో సంగ్రహముగా తెలుపబడుచున్నవి.

**1. మార్గళిత్తిఙ్గళ్ మది నిఱైన్ద నన్నాళాల్**
**నీరాడ ప్పోదువీర్ పోదుమినో నేరిళైయీర్**
**శీర్ మల్కుమ్ ఆయ్ప్పాడి చ్చెల్వ చ్చిఱుమీర్కాళ్**
**కూర్వేల్ కొడున్దొళిలన్ నన్దగోపన్ కుమరన్**
**ఏరార్న్ద కణ్ణి యశోదై యిళమ్ శిఙ్గమ్**
**కార్మేని చ్చెఙ్గణ్ కదిర్ మదియమ్ పోల్ ముకత్తాన్**

**నారాయణనే నమక్కే పఱై తరువాన్**
**పారోర్ పుకళప్పడిన్దు ఏలోరెమ్పావాయ్**

నేర్ = విలక్షణములైన, ఇళైయీర్ = ఆభరణములను కల్గినవారై, శీర్ = సంపదచే, మల్‌కుమ్ = పూర్ణమైన, ఆయ్ ప్పాడి = గోకులమందు, శెల్వమ్ = కృష్ణభక్తి అనెడి సంపదను కల, శిఱుమీర్‌కాళ్ = బాలికలారా!, ఆల్ = ఆశ్చర్యకరమైన, మార్గళి = మార్గశీర్షమను, తిఙ్గళ్ = మాసములో, మది = చంద్రునిచే, నిఱైన్ద = పూర్ణమైన, నల్ = మంచిది అగు, నాళ్ = ఈ దినమున, పారోర్ = లోకములోని జనులు, పుకళ= పొగడునట్లు, పడిన్దు = ఈ నోములో అవగాహించి, నీరాడ = స్నానమును చేయుటకు (శ్రీకృష్ణ సంశ్లేష మును పొందుటకు) పోతువీర్ = రాదలిచినవారైనచో, పోతుమినో = రండు, (అట్లు వచ్చినచో), కూర్ = పదునైన, వేల్ = బల్లెముతో, కొళుమ్ = (శ్రీకృష్ణుని విషయమున గల ప్రీతిచే ఆపదను శంకించి) క్రూరములైన, తొళిలన్ = పనులను చేయువాడగు, నన్దగోపన్ = నందగోపాలుని, కుమరన్ = కుమారుడు, ఏర్ = సౌందర్యముచే, ఆర్న్ద = నిండిన, కణ్ణి = నేత్రములను కల, యశోదై = యశోదాదేవికి, ఇళమ్ శిఙ్గమ్ = బాల సింహమువంటివాడు, కార్ = మేఘమువంటి, మేని = రూపమును కలవాడు, శెమ్ = ఎఱ్ఱని (తామరలవంటి), కణ్=నేత్రములను కలవాడు, కతిర్ మదియమ్ పోల్ = సూర్యుని వంటి, చంద్రునివంటి, ముకత్తాన్ = ముఖమును కలవాడును అగు, నారాయణనే = శ్రీమన్నారాయణుడే (శ్రీకృష్ణుడే), నమక్కు = మనకు, పఱై= (వ్రతాంగమగు) వాద్యము లను, తరువాన్ = ఇచ్చును. (ఏల్, ఓర్ అను రెండును అవ్యయములు పాదపూరణార్థము ప్రయోగింపబడినవి. ఏల్, ఓర్ ఎమ్ పావాయ్– అను పదములను పాదపూరణార్థకములు గను చెప్పవచ్చును. **"ఎమ్ పావాయ్"** అనునది అన్ని పాశురములందును మకుటముగా కానవచ్చుచున్నది.)

సంపదతో నిండిన గోకులములోని కృష్ణభక్తి అనెడి సంపదను కల, గొప్ప ఆభరణము లను దాల్చిన గోపబాలికలారా! మార్గశీర్షమాసములో చంద్రుని కళలతో పూర్ణమైన శుభదిన మీనాడు ప్రాప్తించినది. ఆశ్చర్యము! పదునైన వేలాయుధమును కలవాడును, శ్రీకృష్ణునకు అపకారము చేయుటకు వచ్చు క్షుద్రులపట్ల కోపించి, కఠినముగా వారిని శిక్షించువాడును అగు శ్రీనందగోపాలుని పుత్రుడు, అందమైన కన్నులను కల యశోదాదేవికి బాలసింహము వంటివాడు, మేఘము వంటి మేనును కలవాడు, చంద్రునివలె చల్లనైన ముఖము కలవాడు, శ్రీకృష్ణుని రూపములోనున్న శ్రీమన్నారాయణుడే, "అతడే ఉపాయము, ఉపేయ"మని తలచు



మనకు వ్రతాంగమగు వాద్యమును ప్రసాదింపగలడు. అందుచే ఈ లోకములోని వారందఱు కీర్తించునట్లు చక్కగా స్నానము చేయ కోరిక గల వారందఱును రండు.

ఈ ప్రబంధములోని పలు ప్రయోగములద్వారా ధ్వన్యర్థములు భాసించు చున్నవను అంశము అవతారికలో తెలుపబడినదికదా! ఇందులకు ఉదాహరణముగా ప్రకృత పాశురములోని మొదటి పదమును గ్రహింపవచ్చును. ఈ పాశురము **"మార్గళి"** అను పదముతో ప్రారంభమగుచున్నది. ఈ పదము సంస్కృతములోని మార్గశిరశ్శబ్ద భవము. మృగశీర్షానక్షత్రముతో కూడియున్న పున్నమి ఏ నెలలో వచ్చునో ఆ నెలకు మార్గశీర్షమనిపేరు. చైత్రవైశాఖాది మాసముల పేర్లు కూడ ఈ విధముగానే ఏర్పడిన వనుట ప్రసిద్ధము. ఇది మార్గశీర్షమను శబ్దముయొక్క సామాన్యమైన వ్యుత్పత్తి. మార్గశీర్ష మను సమస్త పదము **"మార్గః, శీర్షమ్"** అను రెండు పదముల కలయికచే ఏర్పడుచున్నది. వాసుదేవ పదమునకు **"వసుదేవస్య అపత్యం పుమాన్ వాసుదేవః"** అను తద్ధితవృత్తిద్వారా ఏర్పడు వ్యుత్పత్తితో పాటు,**"వసతీతి వాసుః, వాసుశ్చాసౌ దేవశ్చ వాసుదేవః"** అను వేఱొక వ్యుత్పత్తిని కూడ శ్రీపరాశరభట్టరు భగవద్గుణదర్పణము అను వ్యాఖ్యానములో చూపిరి. అట్లే ఇచటను **"మార్గేషు శీర్షమ్"** అను వేఱొక వ్యుత్పత్తిని మార్గశీర్ష శబ్దమునకు గ్రహింప వచ్చును. మార్గములలో – సాధనములలో, అనగా – ఉపాయములలో గొప్పది– అని దీని అర్థము. కర్మయోగ – జ్ఞానయోగ – భక్తియోగ – ప్రపత్త్యాదులు మోక్షో పాయములుగా చెప్పబడుచున్నను **"ఉపాయోపేయత్వే తదిహ తత్త్వమ్"** అనునట్లు భగవానుడే ఉత్తమమైన ఉపాయము. ఇదియే మార్గశీర్షము. **"మాసానాం మార్గశీర్షో౽హమ్"** అని గీతలో శ్రీకృష్ణ భగవానుడు స్వయముగా పల్కెను కదా! గోపికలు ఆచరించు మార్గశీర్ష వ్రతములో "భగవానుడే ఉపాయము, అతడే ఉపేయము" అనునదియే కదా పరమార్థము. కాని, ఇంతకంటెను పరమరస్యమైన ధ్వన్యర్థమిచట నిక్షిప్తమైయున్నదని పెద్దల వివరణము. అది ఏమనగా – మోక్షోపాయములన్నిటిలో ఆచార్యాభిమానము ఉత్తమోత్తమము. అదియే ఇచట మార్గశీర్ష పదముచే ధ్వనింపజేయబడినది – అని తిరుప్పావైప్రబంధము సమస్తము ఆచార్యాభిమానరూప చరమోపాయమును గూఢముగా, మధురముగా ముద్రాలంకార ప్రక్రియలో ప్రతిపాదించు చున్నది. ఆచార్యాభిమానమే పరమోపాయమనుటను గోదాదేవి తాను రచించిన రెండవ ప్రబంధమగు గోదాసూక్తములోని (నాచ్చియార్ తిరుమొళి) రెండు పాశురములలో స్పష్టముగా ప్రతిపాదించినది. ఆ ప్రబంధములోని దశమ దశకములోని నాల్గవ, పదియవ పాశురములు ఈ అర్థమును తెల్పుచున్నవి. నాల్గవ పాశురములో గోదాదేవి – "స్వైర

చారిణియగు శూర్పణఖకు అంగభంగమును కల్గించు శ్రీరామచంద్రుని మాట పొల్లు పోయినను, నేను విష్ణుచిత్తమునీంద్రుల పుత్రిని అగుట వితథము అగునా?" అని అన్నది. దీని హృదయమేమనగా – **"మిత్రభావేన సంప్రాప్తం న త్యజేయం కథంచన"** ఇత్యాదిగా శ్రీరామచంద్రుడు పల్కిన మాట అసత్యము అగుటకు అవకాశము లేనేలేదు. ఒకవేళ అది అసత్యమైనను ఆచార్యసంబంధము నిష్ఫలము కాబోదు – అని. **"సిద్ధిర్భవతి వా నేతి సంశయోఽచ్యుతసేవినామ్, న సంశయోఽస్తి తద్భక్తపరిచర్యారతాత్మనామ్"** అని కదా! ప్రమాణము. అట్లే దశమ గాథలో గోదాదేవి "ప్రాణసఖీ! శేషశాయియగు భగవానుడు సర్వాధికుడు, నిరవధికైశ్వర్య సంపన్నుడు, సర్వస్మాత్పరుడును. మనము అత్యల్పులము. అయ్యో! ఏమి చేయుదుము? క్షుద్రులమైన మనకు భగవానుని సాంగత్యమెట్లు లభించును?'' అని వ్యాకులపడినను, వెంటనే తనకు గల ఆచార్యసంబంధమును స్మరించి, "శ్రీవిల్లి పుత్తూరుకు అధిపతి, నాకు ఆచార్యులును అగు విష్ణుచిత్తులు తమకు విధేయుడైన భగవానుని సులభోపాయములద్వారా ఆహ్వానించి, తమ వద్దకు రప్పించుకొనినచో, మనము తప్పక ఆ స్వామిని సేవింప గలము" అని సమాధానపడినది. దీని తాత్పర్యమే మనగా ఆచార్యునివలననే భగవల్లాభము సిద్ధించును, వేఱొక ఉపాయముతో అది సుకరము కాదు – అని. ఇట్లు ఈ రెండు పాశురములలో గోదాదేవి తెలియజేసిన దృఢాధ్యవసాయమే తిరుప్పావై ప్రబంధములో ధ్వన్యర్థరూపమున ప్రకాశింపచేయబడినది. "నేను దృఢముగా నమ్మిన, శీర్షభూతమైన మార్గమునే ఈ ప్రబంధములో జీవనాడిగా చేసి, నేను దానిని అన్యాపదేశముగా పల్కుచున్నాను" అనెడి భావము స్ఫురించుటకొఱకై గోదాదేవిప్రబంధ ప్రారంభమున మార్గశీర్ష (మార్గ<u>ళి</u>) పద ప్రయోగమును చేసెనని తెలియనగును. ఈ భావమునకు అనుగుణముగానే తిరుప్పావై ప్రబంధములోని ప్రయోగములను పూర్వాచార్యులు వ్యాఖ్యానించిరి. (ఈవిధముగానే, భగవానుడే ఉపాయము, ఉపేయమును – అను సిద్ధాంతమునకు అనుగుణముగా కూడా ఈ ప్రబంధము పూర్వాచార్యులచే సాకల్యముగా వ్యాఖ్యానింపబడినది.) ఈ పాశురములో పేర్కొనిన విలక్షణములైన ఆభరణములు అనగా ఆత్మగుణములు, గోపబాలికలు – భగవానునకు అనన్యార్హశేష భూతులైన ఆత్మలు, పఱై – కైంకర్యరూప పరమపురుషార్థము, పావై – భగవత్కైంకర్యరూప వ్రతము, నందగోపుడు – ఆచార్యుడు, యశోద – అష్టాక్షరి. ఇట్లు ఈ ప్రబంధములోని ఆ యా పదములకు గల ఇట్టి సాంకేతికములైన వివరములు క్లుప్తముగా ఆ యా పాశురముల భావము పిదప తెలుపబడును.



**రెండవ పాశురము** : ఇందు వ్రతాంగములైన కృత్యములు విధి – నిషేధ రూపమున తెలుపబడుచున్నవి.

**2. <u>వై</u>యత్తు వాళ్వీర్కాళ్! నాముమ్ నమ్ పావైక్కు**
**చ్చెయ్యుమ్ కిరిశైకళ్ కేళీరో!, పాఱ్కడలుళ్**
**<u>పై</u>యత్తుయిన్ఱ పరమనడి పాడి**
**నెయ్ ఉణ్ణోమ్ పాల్ ఉణ్ణోమ్ నాట్కాలే నీరాడి**
**<u>మై</u>యిట్టె<u>ళు</u>తోమ్ మలరిట్టు నామ్ ముడియోమ్**
**శెయ్యాదన శెయ్యామ్ తీక్కుఱళై శెన్ఱు ఓదోమ్**
**ఐయముమ్ పిచ్చైయుమ్ ఆన్దనైయుమ్ కై కాట్టి**
**ఉయ్యుమాఱెణ్ణి ఉగన్దు ఏలోర్ ఎమ్బావాయ్**

<u>వై</u>యత్తు = ఈ భూమిలో, వాళ్వీర్కాళ్ = ఉజ్జీవింప (తరింప) జన్మించిన వారలారా!, నాముమ్ = ("భగవానునివలననే మనకు ఫలము లభించును" – అని నమ్మి) మనము, ఉయ్యుమ్ ఆఱు = ఉజ్జీవించు ఉపాయమును, ఎణ్ణి = తెలిసి, ఉకన్దు = సంతోషించి, నమ్ పావైక్కు = మన వ్రతమునకు, శెయ్యుమ్ కిరిశైకళ్ = చేయు కార్యములను, కేళీరో=వినుడు, నామ్=మనము, పాల్ కడలుళ్= పాల సముద్రమునందు, <u>పై</u>యత్తుయిన్ఱ= ఆదిశేషునిపై నిద్రించు, పరమన్ = పరమపురుషుని, అడి = పాదములను, పాడి = కీర్తించి, ఐయముమ్ = పేదలకు దానమును, పిచ్చైయుమ్ = పూజ్యులకిచ్చు భిక్షయును, ఆన్దనైయుమ్ = వారికి తగినట్లు వీలయినంత, <u>కై</u>కాట్టి = ఇచ్చి, నెయ్ ఉణ్ణోమ్ = నేతిని భుజింపము, పాల్ ఉణ్ణోమ్ = పాలను భుజింపము, నాట్కాలే = ప్రాతః కాలముననే, నీరాడి= స్నానము చేసి, <u>మై</u> ఇట్టు ఎ<u>ళు</u>దోమ్ = కంటికి కాటుకను అలంకరించుకొనము, మలర్ ఇట్టు = పూవులను గొని, ముడియోమ్ = ముడుచుకొనము, శెయ్యాదన= (పెద్దలు) చేయని పనులను, శెయ్యోమ్ = చేయము, తీక్కుఱళై = (ఇతరులకు) అనర్థమును కల్గించు చెడ్డ మాటలను, శెన్ఱు ఓదోమ్ = (భగవానుని వద్దకు) పోయి పలుకము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

ఈ భూమియందు తరింపగోరినవారలారా! శ్రీమన్నారాయణుడే మనకు ఫలమునిచ్చు వాడనెడి నిశ్చయమును కల మనము ఆచరించు ఈ తిరుప్పావై వ్రతములో చేయదగిన కృత్యములనుగూర్చి తెలిపెదను. వినుడు. పాల సముద్రములో ఆదిశేషునిపై పరుండి యుండు పరమపురుషుని పాదములను కీర్తించి, మనము తరించు ప్రకారములను తెలిసికొనినవారమై, ప్రాతఃకాలముననే స్నానము చేయుదము. ఈ వ్రతసమయ

మున పాలు, నేయి – మొదలగు భోగ్యపదార్థములను భుజింపము. పూలను దాల్చుట, కాటుక పెట్టుకొనుట – మొదలగు అలంకరణలను చేసికొనము. పేదలకు దానము, పూజ్యులైన వారికిచ్చు భిక్షయును యథాశక్తి ఇచ్చెదము. పెద్దలు ఆచరింపని పనులను వేటిని చేయము. ఇతరుల మనస్సులను నొప్పించు మాటలను పలుకము.

ఇందు పేర్కొనబడిన కాటుక(మై)–జ్ఞానయోగము, మలర్–భక్తియోగము, ఐయమ్ – భగవద్వైభవము, పిచ్చై – భాగవతవైభవము, శెయ్యాదన శెయ్యోమ్ – ఆచార్యపురస్కారముగా ఆశ్రయింపకుండుట – అను తగని పనిని చేయము – అని స్వాపదేశార్థము.

**మూడవ పాశురము** : ఇందు గోపికలు తాము నోచు నోమునకు అనుమతిని ఇచ్చినవారికి కల్గు ఫలములను తెలుపుచున్నారు.

**3. ఓఙ్గి ఉలకళన్ద ఉత్తమన్ పేర్ పాడి**
**నాఙ్గళ్ నమ్పావైక్కు చ్చాత్రి నీరాడినాల్**
**తీఙ్గిన్టి నాడెల్లామ్ తిఙ్గళ్ ముమ్మారి పెయ్దు**
**ఓఙ్గు పెరుమ్ శెన్నెల్ ఊడు కయల్ ఉకళ**
**పూఙ్గువళై ప్పోదిల్ పొఱి వణ్డు కణ్ పడుప్ప**
**తేఙ్గాదే పుక్కిరున్దు శీర్త్త ములై పత్రి**
**వాఙ్గ క్కుడల్ నిఱైక్కుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్**
**నీఙ్గాద శెల్వమ్ నిఱైన్దు ఏలోర్ ఎమ్బావాయ్.**

ఓఙ్గి = (త్రివిక్రమావతార సమయమున) పెరిగి, ఉలకు=లోకములను, అళన్ద= కొలిచిన, ఉత్తమన్ = పురుషోత్తమునియొక్క, పేర్ = నామములను, పాడి= కీర్తించి, నాఙ్గళ్ = మనము, నమ్ పావైక్కు = మన వ్రతమునకు, శాత్రి= ఒక నెపమును పెట్టి, నీరాడినాల్ = స్నానము చేసినచో, నాడు ఎల్లామ్ = లోక మంతయు, తీఙ్గు ఇన్టి = (ఈతి బాధలు) ఉపద్రవములు ఏమియు లేక, తిఙ్గళ్ = ప్రతి నెలలో, ముమ్మారి = మూడు వానలు, పెయ్దు = కురిసి, ఓఙ్గు = వర్ధిల్లు, పెరుమ్ = గొప్ప, శెమ్ నెల్ = మేలురకము సస్యముయొక్క, ఊడు = మధ్యలో, కయల్ = చేపలు, ఉకళ = తుళ్ళుచుండగా, పూమ్ = అందమైన, కువళై = నల్ల కలువల, పోదిల్ = పుష్పములందు, పొఱి = కాంతిని కల, వణ్డు= తుమ్మెదలు, కణ్ పడుప్ప = నిద్రింపగా, తేఙ్గాదే = (పాలు తీయు వారు) భయపడక, పుక్కు = గోశాలను ప్రవేశించి, ఇరున్దు = స్థిరముగా నుండి, శీర్త్త = బలిసిన, ములై = (గోవుల) పొదుగును, పత్రి = పట్టి, వాఙ్గ = పితుకగా, వళ్ళల్ = ఉదారములైన, పెరుమ్ = గొప్పవైన, పశుక్కళ్ = గోవులు,



కుడమ్ = కుండలను, నిఱైక్కుమ్ = (పాలతో) నిండించునట్టి, నీఙ్గాద = నిరంతరమైన, శెల్వమ్ = ఐశ్వర్యము, నిఱైన్దు = పరిపూర్ణమైయుండును. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

త్రివిక్రమావతారసందర్భమున పెరిగి, లోకములను అన్నింటిని కొలిచిన పురుషోత్తముని నామములను నోరార కీర్తించి, మనము వ్రతమను నెపమున స్నానమును ఆచరించి నచో దేశమునందు దుర్భిక్షమువంటి ఈతిబాధలు ఏమియు కలుగవు. **“నికామే నికామే నః పర్జన్యో వర్షతి”** అనునట్లు నెలకు మూడు వర్షములు కురియును. క్షేత్రములలోని సస్యములు చక్కగా పెరిగి ఫలించును. సస్యముల మధ్యలో బాగుగా బలిసిన చేపలు త్రుళ్లిపడుచుండగా, అందమైన నల్లకలువలలో తుమ్మెదలు సుఖముగా నిద్రించును. గోపాలురు గోశాలలలో ప్రవేశించి, అచటి గోవుల పొదుగును వారు తాకగానే, ఆ గోవులు పలు కుండలను పాలతో నింపును. ఇట్టి గోసమృద్ధి ఏర్పడుటయే గాక, తరగని సంపద అంతట కల్గును. కావున ఈ వ్రతమును మనమందఱము ఆచరించెదము.

ఈ పాశురములో భగవానుడు త్రివిక్రముడై లోకములను కొలుచుట అనగా– జీవులందఱు తనకు శేషభూతులని తెలియజేయుట, ఉపద్రవములు(తీఙ్గు) – దేహాత్మాభిమానము మొదలగు ఆత్మను నశింపజేయు వ్యాధులు, ముమ్మారి – అనన్యార్హశేషత్వ, అనన్యశరణత్వ, అనన్యభోగత్వములనెడి జీవుని ఆకారత్రయము, పొఱి వణ్డు – లక్ష్మీసహితుడైన భగవానుడు, కయల్ – శిష్యులు, పశుక్కళ్ – భాగవతోత్తములు, కుడమ్ – శిష్యుల హృదయములు – అని ఈ పాశురము లోని స్వాపదేశార్థములు.

**నాల్గవ పాశురము** : తాము నోచు మార్గశీర్షవ్రతమున యథాశక్తి సేవ చేసి, తరింపుమనుచు వారి వద్దకు వచ్చిన వర్షాధిపతియగు పర్జన్యుని చూచి గోపికలు అతడు సేవ చేయదగిన రీతిని ఇందు తెలుపుచున్నారు.

**4. ఆழி మళైక్కణ్ణా! ఒన్రు నీ కైకరవేల్**
**ఆழியుళ్ పుక్కు ముకన్దు కొడు ఆర్త్తేఱి**
**ఊழிముదల్వన్ ఉరువమ్బోల్ మెయ్ కఱుత్తు**
**ప్పాழியమ్ తోళుడై ప్పఱ్పనాబన్ కైయిల్**
**ఆழிపోల్ మిన్ని వలమ్బురిపోల్ నిన్టదిర్న్దు**
**తాழாదే శార్ఙ్గమ్ ఉదైత్త శరమళైపోల్**
**వాழ ఉలకినిల్ పెయ్దిడాయ్ నాఙ్గళుమ్**
**మార్గழி నీరాడ మకిழ்న్దు ఏలోర్ ఎమ్బావాయ్**

ఆళి మళై = (గంభీరమైన) మండల వర్షమునకు, కణ్ణా! = నిర్వాహకుడవైన ఓ వరుణ దేవా! నీ = నీవు, కై = (నీ) ఔదార్యమును, ఒన్ఱు = కొంచెముకూడ, కరవేల్ = దాచకుము, ఉలకినిల్ = లోకములోని జనులు, వాళ = సుఖముగా జీవించునట్లు, నాఙ్గళుమ్ = మేము కూడ, మకిళ్న్దు = ఆనందించి, మార్గళి = మార్గశీర్షవ్రతముకొఱకు, నీరాడ = స్నానము చేయునట్లు, ఆళి ఉళ్ = సముద్రము మధ్యలో, పుక్కు = ప్రవేశించి, ముకన్దు కొడు = (నీటిని) తాగి, ఆర్త్తు = గర్జించి, ఏఱి = ఆకాశమునందు అధిరోహించి, ఊళి = కాలము మొదలగు పదార్థములకు, ముదల్వన్ = కారణభూతుడైన శ్రీమన్నారా యణుని, ఉరువమ్ పోల్ = రూపమువలె, మెయ్ = శరీరము, కఱుత్తు = నల్లబడి, పాళి = బలిష్ఠములై, అమ్= అందమైన, తోళుడై = భుజములను కల, పఱ్పనాబన్ = పద్మనాభునియొక్క కైయిల్ = చేతిలోని, ఆళి పోల్ = సుదర్శనచక్రమువలె, మిన్ని = మెఱిసి, వలమ్ పురిపోల్= దక్షిణావర్తశంఖమగు పాంచజన్యమువలె, నిన్ఱు = నిలచి, అతిర్న్దు = గర్జించి, శార్ఙ్గమ్ = భగవానుని విల్లు అగు శార్ఙ్గము, ఉదైత్త = తీసిన (వర్షించిన), శర మళై పోల్ = బాణవర్షమువలె, తాళాదే = ఆలస్యము చేయకుండ, పెయ్దిడాయ్= వర్షింపుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

గంభీరమైన వర్షమును కురిపించు ఓ పర్జన్యదేవా! నీవు నీ ఔదార్యమును కొంచెము కూడ తగ్గించుకొనకుండ సముద్రములోనికి పోయి, అందరి నీటిని కడుపునిండ తాగి, గర్జింపుము. పిమ్మట ఆకాశమును చేరి, కాలము మొదలగు సకలపదార్థములకు కారణ భూతుడైన భగవానుని మేనువంటి నల్లని రూపమును కలవాడవై, విశాలములైన, బలిష్ఠములైన, సుందరములైన భుజములను కల ఆ పద్మనాభుని కుడిచేతిలోని శ్రీసుదర్శన చక్రమువలె మెఱిసి, ఆ స్వామి ఎడమ చేతిలోని పాంచజన్యమువలె గర్జింపుము. శార్ఙ్గ మను స్వామి విల్లు శత్రువులపై వర్షించు బాణవర్షమువలె నీవు జలమును నిరంతరము వర్షింపుము. నీ విట్లు వర్షించుటవలన లోకములోని వారందఱును సుఖముగా జీవింపగలరు. మేమును మార్గశీర్షవ్రతమున సంతోషముగా స్నానము చేయగల్గుదుము.

ఆళి– భగవానుని కళ్యాణగుణములనెడి సముద్రము, మళై–కళ్యాణగుణ వృష్టి, మిన్ని–ధ్యానయోగముచే ప్రకాశించుట, పాంచజన్యము–ప్రణవార్థము, శార్ఙ్గము–ప్రణవముచే ప్రతిపాదింపబడు జీవాత్మ – పరమాత్మల శేషశేషి భావము, కణ్ణా– ఆచార్యులు, శర మళై– ఆత్మయొక్క స్వరూపయాథాత్మ్యము – అని ఇందలి స్వాప దేశములు (ధన్యర్థములు).



**అయిదవ పాశురము** : మార్గశీర్షవ్రతమును చేయదలచిన గోపికలలో ఒక గోపిక "మనము ఇంతకు ముందు ఎన్నో పాపములను చేసితిమి కదా! ఆ పాపములు ఇపుడు మనము ఆచరించు వ్రతమునకు అడ్డు కావా?" అని ప్రశ్నింపగా, అందులకు సమాధానముగా గోదాదేవి "మనము భగవానుని కీర్తించినచో ఆ పాపము లన్నియు అగ్నిలో పడిన దూదివలె రూపుమాసిపోవు" నని ఇందు పల్కుచున్నారు.

**5. మాయనై మన్ను వడమదురై మైన్దనై**
**తూయ పెరు నీర్ యమునై త్తుఱైవనై**
**ఆయర్ కులత్తినిల్ తోన్ఱు మణివిళక్కై**
**త్తాయైక్కుడల్ విళక్కమ్ శెయ్ద దామోదరనై**
**త్తూయోమాయ్ వన్దు నామ్ తూ మలర్ తూవి త్తొళుదు**
**వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క**
**పోయ పిళైయుమ్ పుకుతరువాన్ నిన్ఱనవుమ్**
**తీయినిల్ తూశాకుమ్ శెప్పు ఏలోర్ ఎమ్బావాయ్**

మాయనై = ఆశ్చర్యకరములైన లీలలను, ఏ గుణములను కలవాడు, మన్ను= (భగవత్సంబంధము) స్థిరముగానుండు, వడ మదురై = ఉత్తరదేశములోని మధురా నగరమునకు, మైన్దనై = ప్రభువు, తూయ = పరిశుద్ధమైన, పెరు = గొప్పదైన (గంభీరమైన), నీర్ = నీటిని కల్గినది అగు, యమునై త్తుఱైవనై = యమునా నదీతీరమును (తన నివాసముగా) కలవాడు, ఆయర్కులత్తినిల్ = గోపాలుర కులమునందు, తోన్ఱుమ్ = ప్రకాశించు, అణి విళక్కై = అందమైనదీపము, (గొప్ప దీపము), తాయై = తల్లి, కుడల్ = కడుపును, విళక్కమ్ శెయ్ద = వెలుగజేసిన, దామోదరనై = దామోదరుని, నామ్ = మనము, తూయోమాయ్ = పరిశుద్ధులమై, వన్దు = వచ్చి, తూ = పరిశుద్ధమైన, మలర్ = పూవులను, తూవి = అర్పించి, తొళుదు = నమస్కరించి, వాయినాల్ = నోటితో (వాక్కుతో), పాడి = కీర్తించి, మనత్తినాల్ = మనసుతో, శిన్దిక్క = ధ్యానించిన, పోయ = పోయిన (పూర్వపు), పిళైయుమ్ = పాపమును, పుకుతదరువాన్ నిన్ఱనవుమ్ = రాబోవు పాపములును, తీయినిల్ = అగ్నిలో, తూశు ఆకుమ్ = దూదివలె అగును (నిశ్శేషముగా నశించును.), కనుక, శెప్పు = (ఆ స్వామి నామములను) పల్కుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

ఆశ్చర్యమును కల్గించు లీలలను,గుణములను కలవాడు, భగవత్సంబంధ మును యుగయుగములుగా కల్గియుండుటచే స్థిరమైన కీర్తిని కల ఉత్తర మధురానగరమునకు

ప్రభువు, పరమపవిత్రమైన, గంభీరమైన నీటిని కల యమునానదీ తీరమున విహరించువాడు, గోపాలకులమునకు మణిదీపము వంటివాడు, తల్లి అగు యశోదాదేవి కడుపును పండించినవాడు, దామోదరుడను పేరును కలవాడగు శ్రీకృష్ణభగవానుని సన్నిధికి పోయి, మనము సువాసనను కల పుష్పములను సమర్పించి, అంజలి ఘటించి, ఆ స్వామి నామములను నోరార పాడి, మనస్సుతో ఆ స్వామి రూపమును, గుణములను ధ్యానించి నచో, మనము పూర్వము అజ్ఞానమువలన చేసిన పాపములు, ఇకపై ప్రమాదవశమున చేయబోవు పాపములును అగ్నిలో పడిన దూదివలె రూపుమాసిపోవును.

ఈ పాశురములో ఆయర్ – అనగా – భగవానునకు అనన్యార్హశేషభూతులు, తూ మలర్ – పరిశుద్ధమైన మనస్సు – అని స్వాపదేశము.

**ఆఱవ పాశురము** : భగవదనుభవమును ఇంతకు ముందు ఎఱుగనిది, మార్గశీర్ష వ్రతమునుగూర్చి తెలియనిదియు అగు ఒకానొక గోపిక ఈ పాశురములో నిద్రలేపబడు చున్నది. ఈ పాశురమునుండి 15వ పాశురమువరకు – అనగా – 10 పాశురములలో పది మంది వేఱు వేఱు స్వభావమును కల గోపికలు నిద్ర లేపబడు చున్నారు.

**6. పుళ్ళుమ్ శిలమ్బిన కాణ్ పుళ్ళరైయన్ కోయిలిల్**
**వెళ్ళై విళి శఙ్గిన్ పేరరవమ్ కేట్టిలైయో**
**పిళ్ళాయ్ ఎழுన్దిరాయ్ పేయ్ములై నఞ్జుణ్డు**
**కళ్ళచ్చకడమ్ కలక్కழிయ కాలోచ్చి**
**వెళ్ళత్తరవిల్ తుయిల్ అమర్న్ద విత్తినై**
**ఉళ్ళత్తు క్కొణ్డు మునివర్కళుమ్ యోగికళుమ్**
**మెళ్ళ ఎழுన్దు అరి ఎన్ఱ పేరరవమ్**
**ఉళ్ళమ్ పుకున్దు కుళిర్న్దు ఏలోర్ ఎమ్బావాయ్**

పుళ్ళుమ్ = పక్షులును, శిలమ్బిన కాణ్ = ఎగిరిపోవుచున్నవి, చూడుము, పుళ్ అరైయన్ = పక్షులకు ప్రభువగు గరుత్మంతునకు, కోయిలిల్ = స్వామియగు భగవానుని ఆలయమందు, వెళ్ళై = తెల్లని, విళి = అందఱిని ఆహ్వానించు, శఙ్గిన్= శంఖముయొక్క, పేర్ అరవమ్ = గొప్ప ధ్వనిని, కేట్టిలైయో = వినలేవా?, పిళ్ళాయ్= ఓ బాలికా!, ఎழுన్దిరాయ్ = లేచి రమ్ము, పేయ్ = పిశాచియగు పూతనయొక్క, ములై = స్తన్యమునకు పూయబడిన, నఞ్జు = విషమును, ఉణ్డు = భుజించి, కళ్ళమ్ = కృత్రిమమైన, శకడమ్= బండిని (శకటాసురుని), కలక్కு అழிయ= కీళ్ళ సంధులు ఊడునట్లు, కాల్ = పాదమును,



ఓచ్చి = చాచి, వెళ్ళత్తు= క్షీరాబ్ధిలో, అరవిల్ = ఆదిశేషునిపై, తుయిల్ అమర్న్ద = నిద్రించిన, విత్తినై = జగత్కారణ భూతుని, మునివర్ కళుమ్ = మునులు, యోగికళుమ్ = యోగులును, ఉళ్ళత్తుక్కొణ్డు= మనస్సులో ధ్యానించి, మెళ్ళ = మెల్లగా, ఎழுన్దు = లేచి, అరి ఎన్ఱ = **"హరిః"** అనుచు పల్కు, పేర్ అరవమ్ = పెద్ద ధ్వని, ఉళ్ళమ్ పుకున్దు = మనస్సులో ప్రవేశించి, కుళిర్న్దు = చల్లబఱచినది. (ఏల్, ఓర్, ఎమ్ పావాయ్)

ఓ బాలికా! పక్షులు అఱచుచు, ఆహారముకొఱకు ఎగిరిపోవుచున్నవి. గమనింపుము. గరుత్మంతునకు ప్రభువగు భగవానుని ఆలయమందు అందఱిని ఆహ్వానించుటకొఱకు ఊదునట్టి తెల్లని శంఖముయొక్క గొప్ప ధ్వనిని వినలేదా! లేచి రమ్ము. పూతన విషపూరితమైన స్తన్యమును గ్రోలినవాడు, శకటాసురుని సంధిబంధములు ఊడునట్లు పాదమును చాచినవాడు, క్షీరాబ్ధిలో ఆదిశేషునిపై పవళించిన జగత్కారణభూతుడును అగు స్వామిని మునులు, యోగులును మనస్సున ధ్యానించుచు నిద్ర లేచి, **"హరిః హరిః హరిః"** అని ముమ్మారు పల్కుచు చేయు నామానుసంధానము గొప్ప ధ్వనియై, మా మనస్సులలో ప్రవేశించి, మమ్ములను చల్లబఱచినది. ఇకనైనను నిద్ర లెమ్ము.

ఈ పాశురములో పుళ్ళుమ్ – అనగా భగవత్సంబంధ ఘటకులగు భగవద్భక్తులు, కోయిల్ – అష్టాక్షరి, శంఖము – ప్రణవము, పిశాచి స్తన్యమునందలి విషము – ప్రకృతినుండి పుట్టిన అహంకార, మమకారములు, మాయాశకటము – అనిత్యమైన దేహము, మునులు – భగవద్గుణానుభవనిష్ఠులు, యోగులు – భగవత్కైంకర్యనిష్ఠులు పేయ్ – ప్రకృతి – అని స్వాపదేశార్థములు.

**ఏడవ పాశురము** : భగవదనుభవమును పొంది, పరవశయైయున్న ఒకానొక గోపిక ఇందు నిద్ర లేపబడు చున్నది.

**7. కీశు కీశు ఎన్ఱు ఎఙ్గుమ్ ఆనైచ్చాత్తన్ కలన్దు**
**పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో పేయ్ ప్పెణ్ణే!**
**కాశుమ్ పిఱప్పుమ్ కలకలప్ప క్కై పేర్త్తు**
**వాశ నఱుఙ్కుழల్ ఆయ్చ్చియర్ మత్తినాల్**
**ఓశై పడుత్త త్తయిరరవమ్ కేట్టిలైయో**
**నాయక ప్పెణ్ పిళ్ళాయ్! నారాయణన్ మూర్తి**

**కేశవనై ప్పాడవుమ్ నీ కేట్టే కిడత్తియో?**

**తేశముడైయాయ్ తిఱ ఏలోర్ ఎమ్బావాయ్**

ఎఙ్గుమ్ = అంతట, ఆనైచ్చాత్తన్ = భరద్వాజపక్షులు, కలన్దు = కలిసి, (తమ ఆడ పక్షులతో కలిసి), కీశు కీశు ఎన్ఱు = కీచు కీచు అని, పేశిన = పల్కిన, పేచ్చు అరవమ్ = మాటల ధ్వనిని, కేట్టిలైయో = వినలేవా?, పేయ్ పెణ్ణే = మతిలేని దానా!, నఱు = గొప్ప, వాశమ్ = సువాసనను కల, కుళల్= కొప్పులను కల్గిన, ఆయ్చ్చియర్ = గోపికలు, కాశుమ్ = (తమ మెడలోని దండలలో గల) కాసులును, పిఱప్పుమ్ = మొగ్గల రూపములో నున్న పుస్తెలును, కలకలప్ప = గలగలమని ధ్వని చేయునట్లు, కై పేర్త్తు = చేతులనెత్తి చాపి, మత్తినాల్ = కవ్వముతో, ఓశై పడుత్త = చప్పుడు చేసిన, తయిర్ = (చిలుకునట్టి) పెఱుగుయొక్క, అరవమ్ = ధ్వనిని, కేట్టిలైయో = వినలేవా?, నాయక ప్పెణ్ పిళ్ళాయ్= మా కందఱకు నాయకురాలైన బాలికా! నారాయణన్ = నారాయణుడును (సర్వస్వామియు), మూర్త్తి = సౌశీల్యమును ప్రకటించుచు అవతరించినవాడు, కేశవనై = కేశి అను అసురుని సంహరించినవాడును అగు స్వామిని, పాడవుమ్= (మేము) కీర్తించుచున్నను, నీ = నీవు, కేట్టే కిడత్తియో = వినుచు, నిద్రించుచుంటివా?, తేశమ్ ఉడైయాయ్ = తేజస్సును కల్గినదానా!, తిఱ = తలుపు తీయుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

అంతటను భరద్వాజపక్షులు తమ ఆడపక్షులతో కూడినవై **"కీచు కీచు"** మని మధురముగా కూయుచున్నవి. ఆ ధ్వనిని నీవు వినలేదా! వెఱ్ఱిదానా! గొప్ప సువాసనను వీచు కొప్పులను కల్గిన గొల్ల వనితలు తమ మెడలో దాల్చిన హారములలోని కాసులు, మొగ్గల రూపములోనున్న తాళిబొట్టు కలిసి శబ్దించునట్లు కవ్వముతో పెఱుగును చిలుకునపుడు వచ్చు చప్పుడును వినలేదా? సర్వస్వామి, సౌశీల్యగుణమును ప్రకటించుచు పలు అవతారములను ఎత్తినవాడు, కేశిసంహర్త అగు శ్రీకృష్ణుని మేము కీర్తించుచున్నను నీవు ఆ కీర్తనమును వినుచు ఇంకను నిద్రించుచున్నావా? తేజస్సును కల్గిన గోపికా! ఇకనైనను లేచి వచ్చి తలుపులను తీయుము.

ఇందు, ఆనైచ్చాత్తన్ – అహంకార నివర్తకులగు పరమభాగవతులు, పేచ్చరవమ్ – విశ్లేషవ్యసనము, కాశు – అష్టాక్షరి, పిఱప్పు – ద్వయమంత్ర, చరమశ్లోకములు, తలుపు తెఱచుట – తమఃకవాటమును తెఱచుట (పోగొట్టుకొనుట), తయిర్ అనగా దివ్య ప్రబంధము – అని స్వాపదేశార్థములు.



**ఎనిమిదవ పాశురము** : అందరూ తనవద్దకు వచ్చి ప్రబోధించునట్లు శ్రీకృష్ణుని అనుగ్రహమును గొప్పగా పొందిన ఒకానొక గోపిక ఇందు ప్రబోధింప బడుచున్నది.

**8. కీళ్ వానమ్ వెళ్ళెన్ఱు ఎరుమై శిఱు వీడు**

**మేయ్వాన్ పరన్దన కాణ్ మిక్కుళ్ళ పిళ్ళైకళుమ్**

**పోవాన్ పోకిన్ఱారై ప్పోకామల్ కాత్తు ఉన్నై**

**క్కూవువాన్ వన్దు నిన్ఱోమ్ కోతుకులముడైయ**

**పావాయ్ ఎళున్దిరాయ్ పాడి ప్పఱై కొణ్డు**

**మావాయ్ పిళన్దానై మల్లరై మాట్టియ**

**దేవాదిదేవనై చ్చెన్ఱు నామ్ శేవిత్తాల్**

**ఆవా ఎన్ఱు ఆరాయ్న్దు అరుళ్ ఏలోర్ ఎమ్బావాయ్.**

కీళ్ = తూర్పుదిశలో, వానమ్ = ఆకాశము, వెళ్ళెన్ఱు = తెల్లబడినది, ఎరుమై= గేదెలు, మేయ్వాన్ = మేయుటకై, శిఱు వీడు = కొంచెముసేపు విడుదలను పొంది, పరన్దనకాణ్ = వ్యాపించినవి చూడుము, పోవాన్ = శ్రీకృష్ణునివద్దకు పోవుటయే ప్రయోజనమని తలచి, పోకిన్ఱారై = పోవు, మిక్కుళ్ళ = మిగిలిన, పిళ్ళైకళుమ్ = పిల్లలను (గోపికలను) పోకామల్ = పోకుండ, కాత్తు = అడ్డుకొని, ఉన్నై = నిన్ను, కూవువాన్ = పిలుచుటకై, వన్దు = వచ్చి, నిన్ఱోమ్ = ఉంటిమి, కోతుకులముడైయ = కుతూహలమును కల, పావాయ్ = స్త్రీత్వపూర్తిని కలదానా!, ఎళున్దిరాయ్ = లేచి రమ్ము, మా = కేశి అను అశ్వరూపుడైన రాక్షసుని, వాయ్= నోటిని, పిళన్దానై = చీల్చినవాడు, మల్లరై = చాణూర ముష్టికులనెడి మల్లవీరులను, మాట్టియ = సంహరించినవాడగు, దేవాది దేవనై= దేవదేవుని (శ్రీకృష్ణుని), శెన్ఱు= చేరి, పఱై కొణ్డు = వాద్యమును గొని, పాడి = (ఆ స్వామి నామములను) పాడి, నామ్ = మనము, శేవిత్తాల్ = సేవించినచో, ఆరాయ్న్దు= (అతడు) మన స్థితిని గమనించి, ఆ ఆ ఎన్ఱు = అయ్యో! అయ్యో! అని, అరుళ్ = అనుగ్రహించును. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

స్త్రీత్వపూర్తిని కల ఓ గోపికా! తూర్పుదెసలో ఆకాశము తెల్లబడినది. గేదెలు మేత మేయుటకై కొంచెముసేపు బంధములనుండి విడుదలను పొంది పచ్చిక బయళ్ళలో తిరుగుచున్నవి. చూడుము. శ్రీకృష్ణుని సన్నిధికి పోవుటయే పరమప్రయోజనమని తలచు మిగిలిన గోపికలను అందఱిని నిలువరించి, నిన్ను పిలచుటకై నీవద్దకు వచ్చియున్నాము. భగవానునియందు కుతూహలమును కల్గినదానా! ఇకనైనను లేచి రమ్ము. అశ్వరూపియైన కేశి నోటిని చీల్చినవాడు, చాణూర ముష్టికులను

మల్లయోధులను మట్టుబెట్టినవాడును అగు దేవదేవుని (శ్రీకృష్ణుని) సన్నిధి చేరి, వ్రతాంగమైన వాద్యమును ఆ స్వామివలన పొంది, ఆ స్వామి నామములను మనము కీర్తించి సేవించినచో, మన స్థితిని గమనించి అతడు "అయ్యో! అయ్యో!" అని తలచి మనపై దయచూపగలడు.

తూర్పు తెల్లబడుట - సత్వోత్తరకాలమగుట, ఎరుమై - అజ్ఞానము, పిళ్ళైగళ్ - చేతనులు (భక్తులు), మా (అశ్వము)-అహంకారము, మల్లులు-అరి షడ్వర్గము, దేవతలు- నిత్యసూరులు - అని ఇందలి స్వాపదేశార్థములు.

**తొమ్మిదవ పాశురము :** స్వామి అయిన "శ్రీకృష్ణుడు రాదలచినపుడు తానే వచ్చును. అంతవరకు వేచియుండుటయే తగినది" - అని తలచిన ఒకానొక గోపిక ఇందు నిద్రలేపబడుచున్నది. శ్రీరాముడు వచ్చి తనను రక్షించువరకు వేచియుండుట యుక్తమని, **"తత్తస్య సదృశం భవేత్"** అనుచు తలచిన సీతాదేవివంటిది ఈ గోపిక.

**9. తూమణి మాడత్తు శుట్రుమ్ విళక్కెరియ**
**తూపమ్ కమళ త్తుయిలణైమేల్ కణ్ వళరుమ్**
**మామాన్ మకళే! మణిక్కదవమ్ తాళ్ తిఱవాయ్**
**మామీర్! అవళై ఎళుప్పీరో ఉన్ మకళ్తాన్**
**ఊమైయో? అన్త్రి చ్చెవిడో? అనన్దలో?**
**ఏమ ప్పెరున్దుయిల్ మన్దిర ప్పట్టాళో?**
**మామాయన్ మాదవన్ వైకున్దన్ ఎన్ఱెన్ఱు**
**నామమ్ పలవుమ్ నవిన్ఱు ఏలోర్ ఎమ్బావాయ్.**

తూ = పరిశుద్ధమైన, మణి = మణులతో నిర్మించిన, మాడత్తు = మేడలో, శుట్రుమ్ = చుట్టును, విళక్కు = దీపములు, ఎరియ = వెలుగు చుండగా, తూపమ్= ధూపము, కమళ= పరిమళింపగా, తుయిల్ = నిద్రింపతగిన, అణైమేల్ = శయ్యలో, కణ్ వళరుమ్ = నిద్రించు, మామాన్ మకళే = మేనమామ కూతురా!, మణి క్కతవమ్ = మణులతో చేసిన తలుపు యొక్క, తాళ్ = గడియను, తిఱవాయ్= తీయుము, మామీర్= అత్తా!, అవళై = ఆమెను, ఎళుప్పీరో = లేపరా! ఉన్ మకళ్ తాన్ = నీ కుమార్తె, ఊమైయో = మూగయా, అన్త్రి = లేక, శెవిడో = చెవిటిదియా?, అనన్దలో = ఉదాసీనులారా!, ఏమప్పట్టాళో = కావలిలో పెట్టబడినదా?, పెరుమ్ తుయిల్ = గాఢముగా నిద్రించునట్లు, మన్దిరప్పట్టాళో = మంత్రమునకు కట్టుబడెనా?, మా మాయన్ = గొప్ప ఆశ్చర్యకరములగు లీలలను కలవాడు, ఎన్ఱు = అనియు, మాదవన్ = మాధవుడు, ఎన్ఱు = అనియు, వైకున్దన్= శ్రీవైకుంఠనాథుడు, ఎన్ఱు = అనియును, నామమ్ పలవుమ్ = పలు నామములను, నవిన్ఱు = పల్కితిమి. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

దోషము లేమియు లేని మణులతో నిర్మింపబడిన భవనములో చుట్టును మంగళ దీపములు వెలుగుచుండగా, ధూపము పరిమళించుచుండగా హంసతూలికా తల్పములో నిదురించు ఓ మామకూతురా! మణిమయమైన గడియను తీయుము. (ఇట్లు పల్కినను గోపిక మాఱు మాటాడకుండుటచే, ఆమె సమీపమున గల ఆమె తల్లిని ఉద్దేశించి) - ఓ అత్తా! మీ కుమార్తె మాటలాడకపోవుటకు ఏమి కారణము? ఆమె మూగదా? చెవిటిదా? మిక్కిలి అలసి నిద్రించుచున్నదా? మాటలాడ రాదని కావలి పెట్టబడినదా? గాఢ నిద్రపోవు నట్లు మంత్రప్రయోగము చేయబడినదా? (అని ప్రశ్నింపగా, ఆమె తల్లి "మీరు భగవన్నామ సంకీర్తనము చేయుడు, అపుడామె లేచి వచ్చును" - అని బదులిచ్చెను. అంత గోపికలు ఇట్లనిరి) "ఆశ్చర్యగుణచేష్టితుడు, మాధవుడు, శ్రీ వైకుంఠవాసుడు" అనుచు భగవానుని పలు నామములను కీర్తించితిమి. ఇకనైనను నిద్ర లేచి రమ్ము.

ఇందు, విళక్కు - జ్ఞానము, మూగ (ఊమై) - వాగింద్రియము భగవానునియందు ఏకాగ్రతను చెందుట, శయ్యపై నిద్రించుట - తన రక్షణకొఱకు తాను ప్రయత్నించుట మాని భగవానుడే ఉపాయమను నిష్ఠను కలిగియుండుట, మామాన్ - అనన్యార్హశేష భూతులగు భాగవతులు, మణి క్కదవమ్ - దేహములో, ఆత్మలో గల మమకార ములు, ఇవి భగవదనుభవములకు అడ్డు. కావున కవాటతుల్యములు. చెవుడు - పరుల నిందా, ప్రశంసలను వినకపోవుట, అనన్దల్ (ఔదాసీన్యము) - చేయదగని పనులలో సోమరి తనమును కల్గియుండుట. తూ మణి మాడమ్ - అప్రాకృతమైన, పంచోప నిషణ్మయమగు స్వామిదివ్యమంగళవిగ్రహము - అని స్వాపదేశార్థములు.

**పదియవ పాశురము :** గోపికలకు నిర్వాహకురాలు, కృష్ణసంశ్లేషమున సమర్థు రాలు, కృష్ణుని ప్రేమను మిక్కుటముగా కల్గినది, కృష్ణుడు తనకు పొరుగింటిలో ఉండుటచే సదా శ్రీకృష్ణానుభవమును కల్గినది అగు వేఱొక గోపిక ఇందు ప్రబోధింప బడుచున్నది.

**10. నోట్రు చ్చువర్క్కమ్ పుకుకిన్ఱ అమ్మనాయ్!**
**మాట్రముమ్ తారారో వాశల్ తిఱవాదార్**
**నాట్రత్తుళాయ్ ముడి నారాయణన్, నమ్మాల్**
**పోట్ర ప్పఱై తరుమ్ పుణ్ణియనాల్, పణ్డొరునాళ్**

**కూ‌ట్రత్తిన్ వాయ్ వీళ్‌న్ద కుమ్బకరణనుమ్**
**తో‌ట్రుమునక్కే పెరున్దుయల్‌తాన్ తన్దానో?**
**ఆ‌ట్ర వనన్దలుడైయాయ్! అరుఙ్కలమే!**
**తే‌ట్రమాయ్ వన్దు తిఱ ఏలోర్ ఎమ్బావాయ్**

నో‌ట్రు = నోము నోచి (సాధనానుష్ఠానమును చేసి), శువర్క్కమ్ = స్వర్గములను (సుఖములను), పుకుకిన్ఱ = పొందగోరిన, అమ్మనాయ్ = అమ్మా!, వాశల్= వాకిటి తలుపును, తిఱవాదార్ = తీయనివారు, మా‌ట్రముమ్ = సమాధానము నైనను, తారారో= ఇవ్వరా? (పలుకరా!), నా‌ట్ర = పరిమళమును కల, తుళాయ్= తులసిచే అలంకరింపబడిన, ముడి = కిరీటమును కల, నారాయణన్= శ్రీమన్నారాయణుడు, నమ్మాల్ = మనచే, పో‌ట్ర= స్తుతింపబడగా, పఱై తరుమ్ = వాద్యమును (పురుషార్థమును) ఇచ్చు, పుణ్ణియనాల్ = పుణ్యరూపుడగు శ్రీకృష్ణునిచే, పణ్డు = పూర్వము, ఒరు నాళ్ = శ్రీరామావతారమున ఒకనాడు, కూ‌ట్రత్తిన్ = మృత్యువుయొక్క, వాయ్ = నోటిలో, వీళ్‌న్ద = పడిన, కుమ్బ కరణనుమ్= కుంభకర్ణుడును, ఉనక్కు = నీకు, తో‌ట్రు = ఓడి, పెరుమ్ తుయిల్ = గొప్ప నిద్రను, తన్దానో = ఇచ్చెనా ఏమి? ఆ‌ట్ర = పూర్ణమైన, అనన్దల్ ఉడైయాయ్= బద్ధకమును కలదానా!, అరుఙ్కలమే = (మా గోష్ఠికి) అరుదైన ఆభరణము వంటిదానా!, తే‌ట్రమాయ్ = తెలివిని కల్గినదానివై (లేచిన దానివై), వన్దు= వచ్చి, తిఱ = (తలుపు) తీయుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

నోము నోచి సుఖమును పొందగోరిన అమ్మా! వాకిటి తలుపులు తీయకున్నను కనీసము ప్రత్యుత్తరమైనను పలుకలేవా? సువాసనను కల తులసిచే అలంకరింపబడిన కిరీటమును కలవాడు, మనము చేయు మంగళాశాసనమునకు మెచ్చి మనము కోరిన ఉత్తమపురుషార్థమును ఇచ్చువాడు, పుణ్యస్వరూపుడును అగు భగవానుడు శ్రీరామావతార మును ఎత్తినపుడు ఆ స్వామిచే కుంభకర్ణుడు మృత్యువు నోటిలో పడుటకు ముందు నిద్ర విషయమున నీతో పోటీపడి ఓడిపోయి, తన గాఢనిద్రను నీకిచ్చెను కాబోలు! లేకున్నచో ఇంత గాఢనిద్రను పోయెదవా! గాఢముగా నిద్రించుదానా! మాకు అరుదైన ఆభరణము వంటిదానా! ఇకనైనను తెలివి తెచ్చుకొని తలుపు తెరువుము.

ఇందు స్వర్గమనగా–నిరతిశయానందరూపమగు పరమపదము, వాకిలి తెఱచుట భాగవతానుభవవిరోధియగు అహంకారమును పోగొట్టుట, కుంభకర్ణుడు– తమోగుణము, నిద్ర – స్వానుభవదశలో ఇతరవిషయములు భాసింపకుండుట – అని స్వాపదేశము.



**పదునొకండవ పాశురము** : అన్నివిధముల అభిజాతయై, కృష్ణునితో తులతూగ గల్గిన ఒకానొక గోపిక ఇందు ప్రబోధింపబడుచున్నది.

**11. క‌ట్రు క్కఱవై క్కణఙ్గళ్ పల కఱన్దు**
**శె‌ట్రార్ తిఱలళియ చ్చెన్రు శెరుచ్చెయ్యుమ్**
**కు‌ట్రమొన్రిల్లాద కోవలర్ తమ్ పొఱ్కొడియే!**
**పు‌ట్రరవల్‌కుల్ పునమయిలే! పోదరాయ్**
**శు‌ట్రత్తు త్తోళిమార్ ఎల్లారుమ్ వన్దు నిన్**
**ము‌ట్రమ్ పుకున్దు ముకిల్ ఒణ్ణన్ పేర్ పాడ**
**శి‌ట్రాదే పేశాదే శెల్వప్పెణ్డాట్టి! నీ**
**ఎ‌ట్రైక్కుఱఙ్గుమ్ పొరుళ్ ఏలోర్ ఎమ్బావాయ్**

క‌ట్రు క్కఱవై = లేత వయస్సులోని గోవుల, పల = పలు, కణఙ్గళ్= సమూహముల నుండి, కఱన్దు = పాలుతీయువారు, శె‌ట్రార్ = శత్రువుల, తిఱల్= బలము, అళియ = నశించునట్లు, శెన్రు = వెడలి, శెరుచ్చెయ్యుమ్ = యుద్ధమును చేయువారు, ఒన్రు కు‌ట్రమ్ = ఒక్క దోషము కూడ, ఇల్లాద = లేనివారును అగు, కోవలర్‌తమ్ = గోపాలుర యొక్క, పొన్ కొడియే = బంగారు తీగవంటిదానా!, పు‌ట్రు = పుట్టలోని, అరవు = పాము పడగవంటి, అల్‌కుల్= నితంబ ప్రదేశమును కలదానా!, పునమయిలే=అడవిలోని నెమలివంటి దానా!, శెల్వమ్ = కృష్ణాను భవమనెడి సంపదను కల, పెణ్డాట్టి = చిన్నదానా!, పోతరాయ్= రమ్ము, శు‌ట్రమ్ ఎల్లారుమ్ = బంధువులందఱును, తోళిమార్ ఎల్లారుమ్ = స్నేహితురాండ్రు అందఱును, వన్దు = వచ్చి, నిన్ = నీ, ము‌ట్రమ్ = ముంగిటి యందు, పుకున్దు= ప్రదేశించి, ముకిల్ వణ్ణన్ = మేఘవర్ణుడగు శ్రీకృష్ణుని, పేర్ పాడ = పేరును కీర్తింపగా, నీ = నీవు, శి‌ట్రాదే = కదలక, పేశాదే =మాటలాడకుండుట, ఎ‌ట్రైక్కు పొరుళ్ = ఏ ప్రయోజనమును ఆశించి, ఉఱఙ్గుమ్ = నిదురించుచున్నావు? (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

లేత వయస్సులోనున్న పలు గోవులను కలవారు, శత్రువుల బలము అణగునట్లు వారిని ఎదిర్చి యుద్ధము చేయువారు, ఎట్టి దోషమును లేనివారును అగు గోపాలకుల కులములోని బంగారు తీగవంటిదానా! పుట్టలోని పాముపడగవంటి నితంబ ప్రదేశమును కల్గినదానా! అడవిలోనున్న మయూరమువంటిదానా! బంధువులు, స్నేహితురాండ్రు అందఱును వచ్చి నీ వాకిటియందు నిలచి, మేఘవర్ణుడగు శ్రీకృష్ణునినామములను

కీర్తించు చుండగా, నీవు ఉలకక పలుకకయుండటలో ఏమి ఉద్దేశ్యము? ఎందులకు నిద్ర పోవుచున్నావు? ఇకనైనను లేచి రమ్ము.

ఇందు, - శెట్రార్ - ఉపాయాంతర, ఉపేయాంతర నిష్ఠులు, తిఱల్ = స్వార్థ పరత్వము, ఉఱఙ్గుదల్ (నిద్రించుట) - భగవానుడే ఉపాయమను అధ్యవసాయ నిష్ఠను కల్గియుండుట, శిట్రాదే - కర్మేంద్రియ వ్యాపారములు లేకుండుట, కట్రు క్కఱవై - సంతానముతో కూడిన శిష్యులు, కఱన్దు - జ్ఞాన ప్రదానమొనర్చి, కుట్రమ్ - పూర్వోత్తరాఘములు, కోవలర్ - భగవానుడే ఉపాయమని, ఉపేయ మని నమ్మువారు, పొన్ కొడి - భక్తిరూపజ్ఞానవైశద్యమును కల్గినది, అల్‌కుల్- పరభక్తి, పున మయిల్- పరమభక్తిని కల్గినది - అని స్వాపదేశార్థములు.

**పండ్రెండవ పాశురము** : లక్ష్మణుడు శ్రీరాముని ఎడబాయక అతని వెంటనే ఉన్నట్లు, శ్రీకృష్ణుని వెన్నంటి యుండు ఒకానొక గోపాలకుని సహోదరి ఇందు నిద్రలేప బడుచున్నది.

**12. కనైత్తిళఙ్గత్తు ఎరుమై కన్ఱుక్కిరఙ్గి**
**నినైత్తు ములైవళియే నిన్ఱు పాల్ శోర**
**ననైత్తిల్లమ్ శేఱాక్కుమ్ నఱ్చెల్వన్ తఙ్గాయ్!**
**పని త్తలై వీళ నిన్ వాశఱ్కడై పట్రి**
**శినత్తినాల్ తెన్నిలఙ్గై క్కోమానై చ్చెట్ర**
**మనత్తుక్కినియానై ప్పాడవుమ్ నీ వాయ్ తిఱవాయ్!**
**ఇనిత్తాన్ ఎళున్దిరాయ్ ఈదెన్న పేరుఱక్కమ్?**
**అనైత్తిల్లత్తారుమ్ అఱిన్దు ఏలోర్ ఎమ్బావాయ్**

ఇళమ్ = లేతవయస్సు గల, కన్ఱు = దూడలను గల, ఎరుమై = మహిషములు, కనైత్తు = తమవద్ద పాలు పితుకువారు లేకుండుటచే (అఱచి), కన్ఱుక్కు = తన దూడలపట్ల, ఇరఙ్గి = దయచూపి, నినైత్తు = (తన దూడ తనవద్ద పాలు తాగుచున్నట్లు) తలచి, ములై వళియే = (తన) పొదుగునుండి, నిన్ఱు = నిలచి, పాల్ శోర = పాలు స్రవింపగా, ఇల్లమ్ = ముంగిటిని, శేఱు ఆక్కుమ్ = బురదగా చేయుచున్న, నల్ శెల్వన్ = గొప్ప సంపదను గలవానియొక్క, తఙ్గాయ్ = చెల్లెలా! పని = మంచు, తలై = తలపై, వీళ = పడుచుండగా, నిన్ = నీ, వాశల్ కడై = వాకిటి గడపను, పట్రి = పట్టుకొని, శినత్తినాల్= కోపముచేత, తెన్ ఇలఙ్గై = అందమైన లంకయొక్క, కోమానై= ప్రభువగు రావణుని, శెట్ర = పాడుచేసిన, మనత్తుక్కు ఇనియానై = మనస్సుకు ప్రియమైనవాడగు శ్రీరాముని, పాడవుమ్ = పాడినను, నీ = నీవు, వాయ్ తిఱవాయ్ = నోరు తెఱచి మాటలాడవు, ఇని త్తాన్= ఇంకను, ఎళున్దిరాయ్ = లేవకుండనున్నావు, ఈతు = ఇది, ఎన్న పేర్ ఉఱక్కమ్= ఏమి పెద్ద నిద్ర, అనైత్తు ఇల్లత్తారుమ్ = అన్ని ఇండ్లవారును, అఱిన్దు = (మా రాకను) తెలిసికొనిరి. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్)



పాలు తీయువారెవ్వరును లేకుండుటచే మహిషములు (బఱ్ఱెలు) తమ లేగదూడల పట్ల వాత్సల్యముతో ఆ దూడలు తమవద్ద పాలు తాగుచున్నట్లు భావింపగా, వాని పొదుగు నుండి పాలధారలు నిరంతరము స్రవించుచున్నవి, ఆపాల వలన ముంగిళ్ళు అన్నియు తడిసి బురదతో నిండుచున్నది. ఇట్టి గొప్ప పశుసంపదను కల్గిన గోపాలకుని చెల్లెలా! మంచు తలపై కురియుచుండగా, నీ వాకిటి గుమ్మమును పట్టుకొని నిలచి యున్నాము. అందమైన లంకకు ప్రభువగు రావణుని చంపినవాడు, మనస్సుకు ప్రియమైన వాడును అగు శ్రీరామచంద్రుని మేమందఱము స్తుతించుచున్నను, నీవు నోరు తెఱచి పలుకకుంటివే! ఇకనైనను లేచి రమ్ము. ఇది ఏమి గాఢ నిద్ర! ఊరిలోని వారందఱు మేము నీ ఇంటి వాకిటిముందు నిలచియుండుటను తెలిసికొనిరి. కావున లేచి రమ్ము.

ఇందు, పాల్-అనగా భగవద్గుణానుభవము, పని - ఆళ్వార్ల సూక్తులవలన కలుగు భగవద్భాగవతగుణానుభవబిందువులు, శేఱు ఆక్కుమ్ - చల్లబఱచుట, రావణుడు - అహంకారము, లంక - సంసారము - అని స్వాపదేశార్థములు.

**పదమూడవ పాశురము** : తన నేత్రసౌందర్యమునకు వశుడైన శ్రీకృష్ణుడు తన వద్దకు స్వయముగా వచ్చునని తలచు గోపిక ఇందు నిద్ర లేపబడు చున్నది.

**13. పుళ్ళిన్ వాయ్ కీణ్డానై ప్పొల్లా అరక్కనై**
**క్కిళ్ళి క్కళైన్దానై క్కీర్‌త్తిమై పాడి ప్పోయ్**
**పిళ్ళైకళ్ ఎల్లారుమ్ పావైక్కళమ్ పుక్కార్**
**వెళ్ళి ఎళున్దు వియాళమ్ ఉఱఙ్గిట్రు**
**పుళ్ళుమ్ శిలమ్బిన కాణ్ పోదరి క్కణ్ణినాయ్!**
**కుళ్ళ క్కుళిర క్కుడైన్దు నీరాడాదే**
**పళ్ళిక్కిడత్తియో పావాయ్! నీ నన్నాళాల్**
**కళ్ళమ్ తవిర్‌న్దు కలన్దు ఏలోర్ ఎమ్బావాయ్**

పుళ్ళిన్ = పక్షిరూపములో వచ్చిన అసురుని (బకాసురుని), వాయ్ = నోటిని, కీణ్డానై = చీల్చినవాడు, పొల్లా = దుర్మార్గుడైన, అరక్కనై = రాక్షసుని, (రావణాసురుని), కిళ్ళి = (తలలను) గిల్లి, కళైన్దానై = సమూహముగా సంహరించినవాడును అగు భగవానుని యొక్క, కీర్త్తిమై = కీర్తిని, పాడి = కీర్తించి, పిళ్ళైకళ్ ఎల్లారుమ్ = గోపబాలికలు అందఱు, పావైక్కళమ్ = సంకేతస్థలమునందు, పుక్కార్ = ప్రవేశించిరి, వెళ్ళి = శుక్ర నక్షత్రము, ఎళున్దు = ఉదయించినది, వియాళమ్ = గురుడు, ఉఱఙ్గిట్రు = అస్తమించెను, పుళ్ళుమ్= పక్షులును, శిలమ్బిన కాణ్ = (ఆహారమును సంపాదించు కొనుటకైపోయిన చోట) కూయుచున్నవి చూడుము, పోదు అరి కణ్ణినాయ్ = తామరల వంటి, జింకకన్నులవంటి నేత్రములను కల్గినదానా!, పావాయ్ = గోపబాలికా, నీ = నీవు, నల్+నాళ్ = మంచి దినమున, కళ్ళమ్ = కపటమును, తవిర్న్దు = వదలి, కలన్దు = (మాతో) కలసి, కుళ్ళ క్కుళిర = చల్లగ, కుడైన్దు = మునిగి, నీరాడాదే = స్నానమును చేయక, పళ్ళి క్కిడత్తియో = శయ్యపై పరుండినావా! (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

బకాసురుని నోటిని చీల్చినవాడు, పరమనీచుడైన రావణుని సంహరించిన వాడగు భగవానుని వీరకృత్యములను కీర్తించి, గోపబాలికలందఱు సంకేతస్థలమును చేరుకొనిరి. శుక్రుడు ఉదయించెను. గురుడు అస్తమించెను. ఆహారమును సంపాదించుటకై వచ్చిన పక్షులు కూయుచున్నవి. తామరలవంటి, జింకకన్నులవంటి కన్నులు కల్గిన ఓ చిన్న గోపికా! మనము అందఱము కలసి ఆనందించుటకు తగిన ఈ మంచిసమయములో నీవు మాత్రము ఒంటరిగా శ్రీకృష్ణుని గుణము లను, లీలలను స్మరించుటను మాని, మాతో కలసి, చల్లగా స్నానమాడ రమ్ము. ఇంకను శయ్యపై నిదురించుచున్నావా! లేచి రమ్ము.

ఇందు, బకాసురుని నోటిని చీల్చుట అనగా–ఆశ్రితులకు తనను పొందుటలో అవరోధములగు కామాదిదోషములను స్వామి నశింప జేయుట, పిళ్ళైగళ్– నూతనముగా భగవదనుభవమును పొందినవారు, పావైక్కళమ్ – భగవద్గుణాను భవము చేయు చోటు, వెళ్ళి – సాత్త్విక జ్ఞానము, వియాళమ్ – స్వాతంత్ర్యాభి మానము, పుళ్ – భాగవతులు, పోతరిక్కణ్ణి – శ్లాఘ్యమైన, స్వచ్ఛమైన, సారగ్రాహి యైన జ్ఞానము, పడకపై పరుండుట, ఒక్కరుగా భగవద్గుణా భవమునుచేయుట – అని స్వాపదేశార్థములు.

**పదునాల్గవ పాశురము** : “నేను ముందుగా నిదుర లేచి, మిగిలిన అందఱిని నిద్ర లేపెద”నని పల్కి, ఆ మాటను మఱచి నిదురపోవు ఒక గోపిక ఇందు నిద్ర లేపబడు చున్నది.



**14. ఉజ్గళ్ పుళైక్కడై తోట్టత్తు వావియుళ్**
**శెజ్గళునీర్ వాయ్ నెకిళ్న్దు ఆమ్బల్‌వాయ్ కూమ్బినకాణ్**
**శెజ్గల్ పొడిక్కూఱై వెణ్ పల్ తవత్తవర్**
**తజ్గళ్ తిరుక్కోయిల్ శజ్గిడువాన్ పోకిన్ఱార్**
**ఎజ్గళై మున్నమ్ ఎళుప్పువాన్ వాయ్ పేశుమ్**
**నజ్గాయ్! ఎళున్దిరాయ్! నాణాదాయ్! నావుడైయాయ్**
**శజ్గొడు శక్కరమ్ ఏన్దుమ్ తడక్కైయన్**
**పజ్గయక్కణ్ణానై ప్పాడ ఏలోర్ ఎమ్బావాయ్**

ఉజ్గళ్ = మీ, పుళైక్కడై = ఇంటి పెరటిలోనున్న, తోట్టత్తు = తోటలోని, వావియుళ్ = బావిలోపల, శెజ్గళునీర్ =ఎఱ్ఱ తామరపూలు, వాయ్ నెకిళ్న్దు = వికసించినవి, ఆమ్బల్= నల్ల కలువలు, వాయ్ కూమ్బిన కాణ్ = ముడుచుకొన్నవి చూడుము, శెజ్గల్ పొడి = కావిరంగు పొడిలో ముంచిన, కూఱై = వస్త్రములను, వెణ్ పల్ = తెల్లని దంతములను కల, తవత్తవర్ = తాపసులు అగు సన్న్యాసులు, తజ్గళ్ = తమయొక్క, తిరుక్కోయిల్= దివ్యాలయమందు, శజ్గిడువాన్ = కుంచెకోల అనబడు తాళపు చెవిని పెట్టి, తలుపు తీయుటకు, పోకిన్ఱార్ = పోవుచున్నారు, ఎజ్గళై = మమ్ము, ఎళుప్పువాన్ = నిద్ర లేపెదనని, వాయ్ పేశుమ్ = పల్కిన, నజ్గాయ్ = పూర్ణురాలా! నాణాదాయ్ = సిగ్గు లేనిదానా!, నావుడైయాయ్ = నాలుకను కలదానా! (మధురముగా మాట్లాడుదానా!), శజ్గొడు = శంఖముతో పాటు, శక్కరమ్ = చక్రమును, ఏన్దుమ్ = ధరించు, తడ క్కైయన్= విశాలములైన హస్తములను కలవాడు, పజ్గయ క్కణ్ణానై = పంకజనేత్రుడగు భగవానుని, పాడ = పాడుటకు, ఎళున్దిరాయ్ = లేచి రమ్ము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

మీ ఇంటి వెనుక పెరటి తోటలోనున్న బావిలో ఎఱ్ఱ తామరలు వికసించినవి. నల్ల కలువలు మూసికొన్నవి. చూడుము. కావిరంగు పొడిలో ముంచిన కాషాయ వస్త్రములను ధరించినవారు, తెల్లని దంతములను కలవారగు తాపసులైన సన్న్యాసులు ఆలయముల తలుపులను బీగముతో తెఱచుటకు పోవుచున్నారు. మమ్ములను ముందుగా లేపెదనని పల్కి, నీ మాటను నిలబెట్టుకొనలేని గోపికా! మాటను నిలబెట్టుకొన లేనందులకు సిగ్గుపడని దానా! మధురముగా మాట్లాడగల్గినదానా! శంఖచక్రధారి, పంకజనేత్రుడును అగు స్వామిని పాడుటకై ఇకనైనను నిద్ర లేచి రమ్ము.

ఈ పాశురములో, వావి (బావి) – అష్టాక్షరి, శెజ్గళునీర్ – నమః పదము, వాయ్ నెకిళ్న్దు (వికసించినది) – పారతంత్ర్యజ్ఞాన వికాసము, అమ్బల్ (నల్ల కలువ) –

స్వాతంత్ర్యజ్ఞానము, కావివస్త్రము – శేషత్వజ్ఞానము, వెణ్ పల్ (తెల్లని దంతములు) – మందహాసము – అని స్వాపదేశములు.

**పదునైదవ పాశురము** : గోపికల బృందమునంతటిని కలిపి దర్శింపవలెనని తలచి, నిద్రను నటించు ఒకానొక గోపిక ఇందు నిద్ర లేపబడు చున్నది.

**15. ఎల్లే! ఇళఙ్కిళియే! ఇన్నమ్ ఉఱఙ్గుదియో!**
**శిల్లెన్రు అళైయేన్మిన్, నఙ్గైమీర్! పోదరుకిన్రేన్**
**వల్లై యున్ కట్టురైకళ్ పణ్డే ఉన్ వాయఱిదుమ్**
**వల్లీర్‌కళ్ నీఙ్గళే నానేదాన్ ఆయిడుగ**
**ఒల్లై నీ పోదాయ్ ఉనక్కెన్న వేఱుడైమై**
**ఎల్లారుమ్ పోన్దారో? పోన్దార్ పోన్దు ఎణ్ణిక్కొళ్**
**వల్లానై కొన్రానై మాత్రారై మాత్రళిక్క**
**వల్లానై మాయనై ప్పాడ ఏలోర్ ఎమ్బావాయ్**

ఇళమ్ కిళియే = చిన్న చిలుకవలె తీయగా పల్కు బాలికా!, ఎల్లే = ఏమి ఆశ్చర్యము!, ఇన్నమ్ = ఇంకను, ఉఱఙ్గుదియో = నిద్రించుచుంటివా? (అని బయటనున్న గోపికలు పలుకగా), శిల్ ఎన్రు = చివుక్కుమనునట్లు, అళైయేల్‌న్మిన్= పిలువకుడు, నఙ్గైమీర్ = పూర్ణలారా!, పోదరుకిన్రేన్ = వచ్చుచున్నాను (అని లోపల ఉన్న గోపిక బదులిచ్చినది). ఒల్లై = సామర్థ్యమును కల, ఉన్ = నీ, కట్టురైకళ్ = కటువైన మాటలను, ఉన్ వాయ్ = నీ వాక్చాతుర్యమును, పణ్డే = ఇంతకు ముందే, అఱిదుమ్ = తెలియుదుము (అని బయటనున్న గోపికలు అనగా), నీఙ్గళే = మీరే, వల్లీర్‌కళ్ = సామర్థ్యమును కలవారు, (పోనిండు, లేక) నానేదాన్= (మీరు పల్కినట్లు) నేనే, ఆయిడుగ = (వాక్‌చాతుర్యమును కలదానను) కానిండు (అని లోపలనున్న గోపిక అనుచు మీకు నేను చేయవలసినదేమి? అని అడుగగా), నీ = నీవు, ఒల్లై = వెంటనే, పోదాయ్ = లేచి రమ్ము, ఉనక్కు = నీకు మాత్రము, వేఱు=ప్రత్యేకమైన, ఉడైమై = స్వామ్యము? (అని బయటి గోపికలు పల్కిరి) ఎల్లారుమ్=అందఱు, పోన్దారో=వచ్చిరా? (అని లోపలనున్న గోపిక ప్రశ్నింపగా), పోన్దార్= వచ్చిరి, పోన్దు = వచ్చి, ఎణ్ణిక్కొళ్ = లెక్క పెట్టుకొనుము, వల్ ఆనై = బలిష్ఠమైన కువలయాపీడమను గజమును, కొన్రానై = చంపినవాడు, మాత్రారై= శత్రువుల, మాత్రళిక్కవల్లానై = శాత్రవమును పోగొట్టగల్గినవాడు, మాయనై= ఆశ్చర్యభూతుడును అగు శ్రీకృష్ణుని, పాడ = పాడుటకు, నీ = నీవు, ఒల్లై = వేగముగా, పోదాయ్ = రమ్ము.



“లేతచిలుకవలె మధురముగా మాట్లాడు ఓ గోపికా! ఏమి ఆశ్చర్యము! ఇంకను నిద్రించుచుంటివా”–అని బయట నిలుచున్న గోపికలు పల్కిరి. అపుడు లోపలనున్న గోపిక – “చివుక్కుమనునట్లు నన్ను పిలువకుడు, ఓ పూర్ణలారా! ఇదిగో వచ్చు చున్నాను” అని బదులిచ్చినది. అపుడు బయటి గోపికలు – “నీ కఠినోక్తులను, నీ మాటల చాతుర్యమును మేము ఇంతకు ముందే తెలియుదుములే” అని సమాధానము పల్కిరి. అంత లోపనున్న గోపిక మరల – “మీరే సామర్థ్యమును కలవారు. నేను కాదు. పోనిండు. మీ మాటే నిజమనుకొందము. నేనే సామర్థ్యము కలదానిని కానిండు. రావలసినవారు అందఱువచ్చిరా” అని అన్నది తదుపరి గోపికలు– “అందఱు వచ్చినారు. నీవే వచ్చి లెక్క పెట్టుకొనుము” అని పలుకగా, లోపల గల గోపిక – “నేను మీతో కలసి వచ్చి, ఏమిచేయ వలెను” – అని ప్రశ్నించినది. అందులకు గోపికలు “కువలయాపీడమను గొప్ప ఏనుగును చంపిన వాడు, శత్రువుల పీచమడచినవాడును అగు భగవానుని కీర్తింప వలెను. వేగమే రమ్ము” అని పల్కిరి.

ఇందు – ఇళఙ్కిళి అనగా–భాగవతాభినివేశమును కల్గినవారు, కట్టురైకళ్ – రహస్యార్థ వచనములు, వల్లానై – అహంకారము, మాత్రార్ – కామక్రోధములు అని స్వాపదేశము.

**పదునాఱవ పాశురము** : గోపికలందఱు కలసి, నందగోపాలుని భవనము వద్దకు పోయి, ఆ భవనమును రక్షించు ద్వారపాలకుని తమను అనుగ్రహింపవలసినదిగా వేడుచున్నారు.

**16. నాయకనాయ్ నిన్ర నన్దగోపనుడైయ**
**కోయిల్ కాప్పానే! కొడిత్తోన్రుమ్ తోరణ**
**వాశల్ కాప్పానే! మణిక్కదవమ్ తాళ్ తిఱవాయ్**
**ఆయర్ శిఱుమియరోముక్కు అఱై పఱై**
**మాయన్ మణివణ్ణన్ నెన్నలే వాయ్ నేర్‌న్దాన్**
**తూయోమాయ్ వన్దోమ్ తుయిలెళ ప్పాడువాన్**
**వాయాల్ మున్నమున్నమ్ మాత్రాదేయమ్మా! నీ**
**నేశ నిలైక్కదవమ్ నీక్కు ఏలోర్ ఎమ్బావాయ్**

నాయకనాయ్ నిన్ఱ = స్వామివైయున్న, నన్దగోపనుడైయ = నందగోపాలుని యొక్క, కోయిల్ = ఇంటిని, కాప్పానే = రక్షించువాడా!, కొడి = ధ్వజములచే, తోన్ఱుమ్ = ప్రకాశించు, తోరణమ్ = తోరణములతో అలంకరింపబడిన, వాశల్= ద్వారమును, కాప్పానే = కాచువాడా!, మణి క్కదవమ్ = అందమైన తలుపుల, తాళ్ = తాళమును (గడియను), తిఱవాయ్ = తెఱువుము, ఆయర్ శిఱుమియరో ముక్కు = చిన్న గోపికలమైన మాకు, మాయన్ = ఆశ్చర్యకరములైన లీలలను చేయువాడు, మణివణ్ణన్ = నీలరత్నము వంటి మేనిని కలవాడు అగు శ్రీకృష్ణభగ వానుడు, అఱై = శబ్దించు, పఱై = వాద్యవిశేషమును, నెన్నలే = నిన్ననే, వాయ్ నేర్న్దాన్ = ఇచ్చెదనని మాట ఇచ్చెను, తూయోమాయ్ = పరిశుద్ధులమై, తుయిల్ ఎళ = నిద్రలేచునట్లు, పాడువాన్ =సుప్రభాతము పాడుటకు, వన్దోమ్ = వచ్చితిమి, అమ్మా = స్వామీ!, మున్నమున్నమ్ = మొట్టమొదట, వాయాల్ = నీ మాటతో, మాఱ్ఱాదే = అడ్డుపెట్టకుము, నీ = నీవు, నేశమ్ = (శ్రీకృష్ణునిపట్ల) స్నేహమును, నిలై = స్థిరముగా కల, కతవమ్ = తలుపును, నీక్కు = తీయుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్)

మాకు స్వామియగు నందగోపాలుని భవనమును రక్షించువాడా! తోరణములతో అలంకరింపబడిన ద్వారమును కావలికాయువాడా! అందమైన తలుపు గడియను తీయము. చిన్నవారమగు మాపై దయ చూపి వాద్యవిశేషమును అనుగ్రహించెదనని ఆశ్చర్యచేష్టితము లను చేయువాడు, నీలమణిసదృశవర్ణుడును అగు శ్రీకృష్ణ భగవానుడు నిన్ననే మాకు చెప్పెను. భగవానుని సేవ తప్ప వేఱొక ప్రయోజనమును ఆశింపని అనన్య ప్రయోజనలమై, శ్రీకృష్ణుని నిద్రలేపుటకు వచ్చితిమి. నీవు ముందుగా నీ నోటితో వలదని పలుకకుము. స్నేహమును కల (దగ్గఱగా చేరియున్న), పొందికగానున్న తలుపును తీయుము.

ఇందు, నందగోపన్ – ఆచార్యుడు, తోరణవాశల్ – అష్టాక్షరియొక్క అర్థము, కోయిల్ – అష్టాక్షరి, మణిక్కదవు (అందమైన తలుపు) – ఆత్మస్వరూపానుభవము, తాళ్ – స్వస్వాతంత్ర్యము, తూయోమాయ్ (పరిశుద్ధులమై) – భగవత్కైంకర్యమును తప్ప వేఱొక ప్రయోజనమును ఆశింపనివారమై – అని స్వాపదేశార్థములు.

**పదునేడవ పాశురము** : ద్వారపాలకుడు తలుపులు తెఱవగా, గోపికలు నందభవనములోనికి ప్రవేశించి, నందగోపాలుని, యశోదను, శ్రీకృష్ణుని, బలరాముని ప్రబోధించుచున్నారు.



**17. అమ్బరమే తణ్ణీరే శోఱే అఱమ్ శెయ్యుమ్**
**ఎమ్బెరుమాన్! నందగోపాలా! ఎళున్దిరాయ్**
**కొమ్బనార్క్కెల్లామ్ కొళున్దే! కులవిళక్కే !**
**ఎమ్బెరుమాట్టి యశోదాయ్! అఱివుఱాయ్**
**అమ్బరమూడఱుత్తు ఓఙ్గి యులకళన్ద**
**ఉమ్బర్ కోమానే! ఉఱఙ్గాదు ఎళున్దిరాయ్**
**శెమ్బొఱ్కళలడి చ్చెల్వా! బలదేవా!**
**ఉమ్బియుమ్ నీయుమ్ ఉఱఙ్గు ఏలోర్ ఎమ్బావాయ్**

అమ్బరమ్ = వస్త్రములను, తణ్ణీర్ = చల్లని నీటిని, శోఱు = అన్నమును, అఱమ్ శెయ్యుమ్ = ధర్మము చేయు, ఎమ్బెరుమాన్ = మాకు స్వామీ!, నన్దగోపాలా= నంద గోపాలా!, ఎళున్దిరాయ్ = నిద్రలెమ్ము, కొమ్బు అనార్క్కెల్లామ్ = నీటిప్రబ్బలి తీగవంటి నడుము గల స్త్రీలకు అందఱికి, కొళున్దే = చిగురువంటిదానా! (ప్రధానురాలా!), కుల విళక్కే = గొల్లకులమునకు దీపమా!, ఎమ్బెరుమాట్టి = మాకు యజమానురాలా!, అశోదాయ్ = యశోదాదేవీ!, అఱివురాయ్ = నిద్ర లెమ్ము, అమ్బరమ్ = ఆకాశము నంతటిని, ఊడఱుత్తు = భేదించుకొని, ఓఙ్గి = పెఱిగి, ఉలకు అళన్ద = లోకములను కొల్చిన, ఉమ్బర్ కోమానే = దేవాధిదేవా!, ఉఱఙ్గాదు= నిద్రింపక, ఎళున్దిరాయ్ = నిద్రలెమ్ము, శెమ్ పొన్ కళల్ అడి = ఎఱ్ఱని బంగారముతో చేయబడిన కడియములచే అలంకరింపబడిన పాదములను కలవాడా!, శెల్వా = భగవత్ కైంకర్య లక్ష్మిని కలవాడా!, బలదేవా = బలదేవా!, ఉమ్బియుమ్ = నీ తమ్ముడును (శ్రీకృష్ణుడును), నీయుమ్ = నీవును, ఉఱఙ్గేల్ = నిద్రింపకుడు. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్ – పాదపూరకములు).

వస్త్రములను, పానీయములను, అన్నమును ఉదారముగా దానము చేయువాడవు, మాకు స్వామివి అగు నందగోపాలా! నిద్ర లెమ్ము! ప్రబ్బలి తీగవంటి నడుమును కల సుందరీమణులకందఱికి చిగురువంటిదానవు, గొల్ల కులమునకు దీపమువంటిదానవు, మాకు యజమానురాలవును అగు యశోదా! నిద్ర లెమ్ము, బ్రహ్మాండాకాశమును ఛేదించు కొని వృద్ధి చెంది, లోకములను కొలిచిన దేవాధిదేవా! నిద్రనుండి లెమ్ము. అందమైన బంగారు కడియములను పాదములందు కల్గిన, భగవత్ సేవ అను సిరిని కల బలరామా! నీవు, నీ తమ్ముడగు శ్రీకృష్ణుడును ఇక నిద్రింపకుడు. మేల్కొనుడు.

ఇందు, అంబరమ్ – (భోగ్యవస్తువులు) – తిరుమంత్రము, తణ్ణీర్ – (ధారకము)– ద్వయమంత్రము, శోఱు – (పోషకము) – అనగా – చరమశ్లోకము, అశోద(యశోద) – అష్టాక్షరి, ఉమ్బర్–నిత్యసూరులు – అని స్వాపదేశార్థములు.

**పదునెనిమిదవ పాశురము** : ముందు శ్లోకమున నందగోపాలుని, యశోదను, బలరాములను నిద్రలేపగా వారు మేల్కొనిరి. శ్రీకృష్ణుడు లేవకుండుటచే తమకు పురుషకారభూతయగు (సహాయభూతయగు) నీళాదేవిని గోపికలు ఇందు నిద్ర లేపుచున్నారు.

**18. ఉన్దు మదకళిట్రన్ ఓడాద తోళ్వలియన్**
**నన్దగోపాలన్ మరుమకళే! నప్పిన్నాయ్!**
**కన్దమ్ కమళుమ్ కుళలీ! కడై తిఱవాయ్**
**వన్దు ఎఙ్గుమ్ కోళి యళైత్తన కాణ్! మాదవి**
**ప్పన్దల్‌మేల్ పల్ కాల్ కుయిలినఙ్గళ్ కూవిన కాణ్**
**పన్దార్‌విరలి! ఉన్ మైత్తునన్ పేర్ పాడ**
**శెన్దామరై క్కై యాల్ శీరార్ వళై యొలిప్ప**
**వన్దు తిఱవాయ్ మకిళ్‌న్దు ఏలోర్ ఎమ్బావాయ్**

మదమ్ = మదజలము, ఉన్దు = స్రవించునట్టి, కళిట్రన్ = ఏనుగువంటివాడు, ఓడాద = ఓడిపోని, తోళ్ వలియన్ = బాహుబలమును కలవాడును అగు, నన్దగోపాలన్ = నందగోపాలుని, మరు మకళే = కోడలా!, కన్దమ్ = పరిమళము, కమళుమ్ = వీయు, కుళలీ= కేశపాశమును కలదానా!, నప్పిన్నాయ్ = నీళాదేవీ!, కడై తిఱవాయ్ = గడియను తీయుము, ఎఙ్గుమ్=అంతట, కోళి = కోళ్ళు, వన్దు=వచ్చి, అళైత్తనకాణ్ = కూయు చున్నవి, మాతవి = గురివిందతీగ, పన్దల్ మేల్=పందిరిపై, కుయిల్ ఇనఙ్గళ్ = కోకిలల గుంపులు, పల కాల్ = పలుసార్లు, కూవిన = కూయుచున్నవి, పన్దు = బంతి, ఆర్ = అమరియున్న, విరలి = వేళ్ళను కలదానా!, ఉన్ మైత్తునన్ = నీ నాథుడగు శ్రీకృష్ణునియొక్క, పేర్ పాడ = నామమును కీర్తించుచుండగా, శీర్ ఆర్ = సౌందర్యమును నిండుగా కల, వళై = గాజులు, ఒలిప్ప = ధ్వనింపగా, వన్దు = వచ్చి, శెమ్ తామరై = ఎఱ్ఱ తామరవంటి, కైయాల్ = చేతితో, మకిళ్‌న్దు = ఆనందించి, తిఱవాయ్ = తలుపు తీయుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్)

మత్తగజమువలె గొప్ప బలమును కలవాడు, శత్రువులకు ఓడిపోని బాహు బలమును కలవాడును అగు నన్దగోపాలుని కోడలా! పరిమళభరితములగు కేశములను కల నీళాదేవీ! తలుపు గడియను తీయుము. చుట్టును అంతట కోళ్ళు కూయుచున్నవి. బండిగురి విందలత పందిరిపై కోయిలల గుంపులు నిరంతరము మధురముగా కూయుచున్నవి. లీలాకందుకమును పట్టుకొన్న చేతివేళ్ళను కల్గినదానా! నీ నాథుడగు శ్రీకృష్ణుని నామము లను మేము స్తుతించుచుండగా, అందమైన నీ చేతిగాజులు గలగల శబ్దించు నట్లుగా వచ్చి, ఎఱ్ఱ తామరవంటి నీ చేతితో తలుపు గడియను తీయుము.



ఇందు, కోళి – భాగవతులు, మాధవీలతపందిరి – ఉపనిషత్తులు, మద గజము – అహంకారము, ఓడాద తోళ్వలియన్ – లోకవిలక్షణమైన జ్ఞానమును కలవాడును, కడై తిఱవాయ్ – అజ్ఞానమును పోగొట్టుము, కోయిల గుంపు – పూర్వాచార్యుల గోష్ఠి, బంతి – చేతనవర్గము, కై(చేయి) – జ్ఞానము, వళై ఒలిప్ప– రహస్యత్రయ జ్ఞానము ప్రకాశింపగా – అని స్వాపదేశార్థములు.

**పందొమ్మిదవ పాశురము** :ముందు పాశురములో ప్రబోధింపబడిన నీళాదేవి లేచి తలుపు తీయుటకు ప్రయత్నింపగా, శ్రీకృష్ణుడు ఆమెను అట్లు చేయనీయక అడ్డుపడెను. ఈ సంగతిని గ్రహించిన గోపికలు మరల శ్రీకృష్ణుని నిద్ర లేపి, అప్పటికిని అతడు లేవకుండుటచే మరల నీళాదేవిని ఈ పాశురములో గోపికలు ప్రబోధించుచున్నారు.

**19. కుత్తువిళక్కెరియ కోట్టుక్కాల్ కట్టిల్ మేల్**
**మెత్తెన్ఱ పఞ్జశయనత్తిన్ మేలేఱి**
**కొత్తలర్ పూఙ్కుళల్ నప్పిన్నై కొఙ్గైమేల్**
**వైత్తు క్కిడన్ద మలర్ మార్‌బా! వాయ్ తిఱవాయ్**
**మైత్తడమ్ కణ్ణినాయ్! నీ ఉన్ మణాళనై**
**ఎత్తనై పోదుమ్ తుయిలెళ ఒట్టాయ్ కాణ్!**
**ఎత్తనైయేలుమ్ పిరివు ఆట్రకిల్లాయాల్**
**తత్తువమన్ఱు తగవు ఏలోర్ ఎమ్బావాయ్**

కుత్తు విళక్కు = గుత్తి దీపములు, ఎరియ = వెలుగుచుండగా, కోడు =ఏనుగు దంతములచే చేయబడిన, కాల్ = కాళ్లను గల, కట్టిల్ మేల్ = మంచము మీద గల, మెత్తెన్ఱ = మెత్తని, పఞ్జ శయనత్తిన్ మేల్ = అయిదు గుణములను కల పడుకపై, ఏఱి= ఎక్కి, కొత్తు = గుత్తులు గుత్తులుగా, అలర్ = పూయు, పూ = పూవులతో అలంకరింపబడిన, కుళల్ = కొప్పును కల, నపిన్నై = నీళాదేవియొక్క, కొఙ్గై = స్తనములను, మేల్ వైత్తు = తనపై యుండునట్లుంచుకొని, కిడన్ద = పరుండిన, మలర్

మార్‌బా = వికసించిన వక్షఃస్థలమును కలవాడా!, వాయ్ తిఱవాయ్ = నోటిని తెఱువుమా!, మై = కాటుకతో అలంకరింపబడిన, తడమ్ = విశాలమైన, కణ్ణినాయ్ = కన్నులను కలదానా!, పిరివు = (నీ నాథుని) ఎడబాటును, ఎత్తనైయేలుమ్ = క్షణకాలమైనను, ఆట్రకిల్లాయ్ = సహింపలేని దానా!, నీ = నీవు, ఉన్ = నీ, మణాళనై = భర్తయగు శ్రీకృష్ణుని, ఎత్తనై పోదుమ్ = ఒకక్షణ మైనను, తుయిల్ ఎళ ఒట్టాయ్‌కాణ్ = నిద్రనుండి లేచుటకు అంగీకరింపవు సుమా!, తత్తువమ్ = (ఇది నీ స్వరూప) తత్త్వము కాదు, అన్టు = కాదు, తకవు అన్టు = నీ స్వభావమునకు తగినదియును కాదు. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్)

చుట్టును మంగళదీపస్తంభములు ప్రకాశించుచుండగా, ఏనుగు దంతములతో నిర్మింపబడిన కాళ్లను గల, విశాలమైన మంచముపై అందము, ధావళ్యము, శైత్యము, మార్దవము, సౌరభములను అయిదు గుణములను కల పరుపై పరుండి, వికసించిన పూవుల గుత్తులను కొప్పులో ముడుచుకొనిన నీళాదేవి స్తనములను నీపై యుండునట్లు ఆమెను కౌగలించుకొనియున్న స్వామీ!, నోఱు తెఱచి మాటలాడుము! కాటుకచే అలంక రింపబడిన, విశాలములైన నేత్రములను కల ఓ నీళాదేవీ! నీవు నీ నాథుని ఎడబాటును క్షణకాలమైనను సహింపలేకున్నావా! ఏమి ఆశ్చర్యము! ఇది నీ స్వరూపమునకు కాని, స్వభావమునకు కాని తగినది కాదు సుమా!

ఇందు, కుత్తు విళక్కు - సర్వజ్ఞత్వము, కాల్ (మంచముకోడు) - చతుర్విధ కర్తృత్వ బుద్ధి, కట్టిల్ (శయ్య) - లీలావిభూతి, పంచ శయనము - అర్థపంచకజ్ఞానము, శయ నము- ముముక్షువుల హృదయములు, మై (కాటుక) - భక్తి అను అంజనము, కణ్- జ్ఞానము, వికసించిన పూవులు - జ్ఞానప్రకాశము కల ఆత్మలు - అని స్వాపదేశార్థములు.

**ఇరువదియవ పాశురము** : ఇంకను నిద్ర లేవని శ్రీకృష్ణుని, నీళాదేవిని గోపికలు మరల ఈ పాశురములో నిద్ర లేపుచున్నారు.

**20. ముప్పత్తు మూవర్ అమరర్‌క్కు మున్ శెన్టు**
**కప్పమ్ తవిర్‌క్కుమ్ కలియే! తుయిలెళాయ్**
**శెప్ప ముడైయాయ్! తిఱలుడైయాయ్! శెట్రార్‌క్కు**
**వెప్పమ్ కొడుక్కుమ్ విమలా! తుయిలెళాయ్**
**శెప్పన్న మెన్‌ములై చ్చెవ్వాయ్ శిఱు మరుఙ్గల్**
**నప్పిన్నై నఙ్గాయ్! తిరువే! తుయిలెళాయ్**



**ఉక్కముమ్ తట్టొళియుమ్ తన్దు ఉన్ మణాళనై**
**ఇప్పోదే ఎమ్మై నీరాట్టు ఏలోర్ ఎమ్బావాయ్**

ముప్పత్తు మూవర్ = ముప్పది మూడు కోట్ల విధముల, అమరర్‌క్కు = దేవతలకు, మున్ = (కష్టము కలుగుటకు) ముందే, శెన్టు = వెళ్ళి, కప్పమ్ = వారి కంపమును, తవిర్‌క్కుమ్ = పోగొట్టు, కలియే = బలిష్ఠుడా!, తుయిల్ ఎళాయ్ = నిద్రనుండి లేవుము, శెప్పముడైయాయ్ = ఆర్జవమును కలవాడా!, తిఱల్ ఉడై యాయ్= సామర్థ్యమును కలవాడా!, శెట్రార్‌క్కు = శత్రువులకు, వెప్పమ్ = తాపమును, కొడుక్కుమ్ = ఇచ్చు, విమలా = విమలుడా!, తుయిల్ ఎళాయ్ = నిదుర లేవుము, శెప్పు అన్న = బంగారు కలశముల వంటి, మెన్ = మృదువైన, ములై = స్తనములను, శెవ్వాయ్ = ఎఱ్ఱని అధరములను, శిఱు = సన్నని, మరుఙ్గల్ = నడుమును, నప్పిన్నై = నీళాదేవి అను పేరును కల, నఙ్గాయ్ = స్త్రీత్వపూర్తిని కలదానా!, తిరువే = సంపత్తును కలదానా!, తుయిల్ ఎళాయ్ = నిద్ర లెమ్ము, ఉక్కముమ్ = ఆలవట్టమును, తట్టొళియుమ్ = అద్దమును, ఉన్ మణాళనై = నీ నాథుడగు శ్రీకృష్ణుని, తన్దు = ఇచ్చి, ఎమ్మై = మమ్మును, ఇప్పోదే= ఇపుడే, నీరాట్టు = స్నానమాడజేయుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

ముప్పదిమూడు కోట్ల దేవతలకు ఎట్టి భయమును కలుగకుండ కాపాడుచు, వారి కంపమును పోగొట్టు బలమును కలవాడా! నిద్ర లెమ్ము. ఆర్జవగుణమును కలవాడా! ఆశ్రితుల విరోధులను నశింపచేయు సామర్థ్యమును కలవాడా! విమలుడా! నిద్ర లెమ్ము. బంగారు కలశములవంటి, మృదువైన స్తనములను, ఎఱ్ఱని అధరమును, సన్నని నడుమును కల నీళాదేవీ! మేల్కొనుము. ముందుగా నీవు మాకు వ్రతాంగములగు విసనకఱ్ఱను, అద్దమును ఇచ్చి, మమ్ములను నీ భర్తతోపాటు స్నానమాడించి (స్వామి సేవాభాగ్యమును కలుగజేసి) ఆనందింపచేయుము.

ఇందు, కప్పమ్ (కంపము) - జ్ఞానసంకోచమువలన కల్గు భయము, శెట్రార్ - భాగవతవిరోధులు, శెప్పమ్ - నిష్పక్షపాతము, మెన్ ములై - పరమభక్తి, శెవ్వాయ్ - వాక్చాతుర్యము, మరుఙ్గల్ - వైరాగ్యము, ఉక్కమ్ (ఆలవట్టము) - అహంకార నివృత్తి, తట్టొళి - స్వరూపజ్ఞానము, నప్పిన్నై - లక్ష్మీదేవి - అని స్వాపదేశార్థములు.

**ఇరువదియొకటవ పాశురము** : గోపికల ప్రబోధమును వినిన నీళాదేవి గోపికలతో "నేను కూడ మీలో ఒకతెనే కదా! మనమందఱము కలసి శ్రీకృష్ణుని ప్రార్థించెదము రండు" అనగా, ఆమెతో కలసి గోపిక లందఱును స్వామిని ప్రబోధించు చున్నారు.

**21. ఏ౻్ర కలజ్గళ్ ఎదిర్ పొజ్గి మీదళిప్ప**
**మా౻్రాదే పాల్ శొరియుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్**
**ఆ౻్రప్పడైత్తాన్ మకనే! అఱివుఱాయ్!**
**ఊ౻్రముడైయాయ్! పెరియాయ్! ఉలకినిల్**
**తో౻్రమాయ్ నిన్ఱ శుడరే! తుయిలెళాయ్**
**మా౻్రార్ ఉనక్కు వలి తొలైన్దు ఉన్ వాశఱ్కణ్**
**ఆ౻్రాదు వన్దు ఉన్ అడి పణియుమాపోలే**
**పో౻్రి యామ్ వన్దోమ్ పుకళ్న్దు ఏలోర్ ఎమ్బావాయ్**

ఏ౻్ర = పాలను పితుకుటకు తీసిపెట్టిన, కలజ్గళ్ = భాండములు, ఎదిర్ పొజ్గి=ఎదురుగా పొంగి, మీదు అళిప్ప = పైకి పొర్లునట్లు, మా౻్రాదే = ఎడ తెగక, పాల్ = పాలను, శొరియుమ్ = స్రవించునట్టి, వళ్ళల్ = ఉదారములైన, పెరుమ్ = గొప్ప, పశుక్కళ్ = గోవులను, ఆ౻్ర = అనేకములను, పడైత్తాన్ = కల్గనవాడగు నందగోపాలుని, మకనే = కుమారుడా! అఱివు+ఉఱాయ్ = నిద్రలెమ్ము, ఊ౻్రమ్ ఉడైయాయ్ = వేదములనెడి దృఢమైన ప్రమాణముచే ప్రతిపాద్యుడ వైనవాడా!, పెరియాయ్ = అంతు లేని మహిమను కలవాడా!, ఉలకినిల్ = లోకములో, తో౻్రమాయ్ నిన్ఱ = (అవతారములద్వారా) వ్యక్తమైయున్న, శుడరే= తేజోరూపుడా!, తుయిల్ ఎళాయ్ = మేల్కొనుము, మా౻్రార్ = శత్రువులు, ఉనక్కు = నీకు, వలి తొలైన్దు = బలమును కోల్పోయి, ఉన్ = నీయొక్క, వాశల్ కణ్ = వాకిటిప్రదేశమునకు, ఆ౻్రాదు = వేఱు గతి లేక, వన్దు = వచ్చి, ఉన్ అడి = నీ పాదములను, పణియుమాపోలే = నమస్కరించునట్లు, యామ్ = మేమును, పుకళ్న్దు = నీ కళ్యాణ గుణములను కీర్తించి, పో౻్రి = మంగళాశాసనమును చేయుటకు, వన్దోమ్ = వచ్చితిమి. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

పాలను తీయుటకై పెట్టిన కుండలన్నియు వేగముగా నిండి, పొంగిపొర్లునట్లు నిరంతరము పాలను వర్షించు ఉదారస్వభావమును కల గొప్ప గోవులను పెక్కింటిని కల్గిన నందగోపాలుని కుమారుడా! మేల్కొనుము. దృఢప్రమాణమగు వేదముచే ప్రతి పాదింపబడువాడా! అంతు లేని మహిమను కల్గినవాడా! ఆశ్రితరక్షణార్థము లోకమున అవతరించిన తేజోరూపుడా! నిద్ర లెమ్ము. నీకు శత్రువులు ఓడి, తమ బలమును కోల్పోయి, నీ ప్రతాపమును సహింపలేక నీ వాకిటికి దీనులై వచ్చి, నీ పాదములను



ఆశ్రయించు విధమున, మేమును వేఱు గతి లేనివారమై, అకించనలమై నీ పాదసన్నిధిని చేరితిమి. మమ్ము అనుగ్రహింపుము.

ఇందు, కలజ్గళ్ శిష్యులు, పశువులు - రహస్యములు, ఊ౻్రమ్ - శబ్ద ప్రమాణము, వలి తొలైన్దు (బలమును కోల్పోయి) - నిరుపాధికశేషత్వమును కలవారై, పాల్ - భోగ్యమైన జ్ఞానము, పశుక్కళ్ - ఆచార్యులు - అని స్వాప దేశార్థములు.

**ఇరువదిరెండవ పాశురము** : ఇందు గోపికలు తమ అభిమాన శూన్యతను నివేదించుకొనుచు, భగవానునకు తాము శేషభూతులము - అని తెలుపు చున్నారు.

**22. అజ్గణ్ మాఞాలత్తు అరశర్ అబిమాన**
**బజ్గమాయ్ వన్దు నిన్ పళ్ళిక్కట్టిల్ కీళే**
**శజ్గమిరుప్పార్ పోల్ వన్దు తలై ప్పెయ్దోమ్**
**కిజ్కిణి వాయ్ చ్చెయ్ద తామరై ప్పూప్పోలే**
**శెజ్గణ్ శిఱుచ్చిఱిదే ఎమ్మేల్ విళియావో**
**తిజ్గళుమ్ ఆదిత్తయనుమ్ ఎళున్దాఱ్పోల్**
**అజ్గణ్ ఇరణ్డుజ్కొణ్డు ఎజ్గళ్మేల్ నోక్కుదియేల్**
**ఎజ్గళ్ మేల్ శాపమిళిన్దు ఏలోర్ ఎమ్బావాయ్**

అమ్ = అందమైన, కణ్ = విశాలమైన, మా = గొప్ప, ఞాలత్తు = భూమి యందు, అరశర్ = ప్రభువులు, అబిమాన పజ్గమాయ్ = తమ అభిమానము భగ్నముకాగా, వన్దు= వచ్చి, నిన్ = నీ, పళ్ళికట్టిల్ కీళే = సింహాసనము క్రింద, శజ్గమ్ = సంఘముగా, ఇరుప్పార్పోల్ = ఉన్నవిధమున, వన్దు = వచ్చి, తలై ప్పెయ్దోమ్ = (అదృష్టవశమున నిన్ను) చేరితిమి, కిజ్కిణి వాయ్చ్చెయ్ద= చిన్ని మువ్వలవలె కొంచెము విడుచుకొనిన, తామరై ప్పూప్పోలే= తామరపూవువలె, శెమ్ = (వాత్సల్యముచే) ఎఱ్ఱబడిన, కణ్ = కన్నులను, శిఱిచ్చిఱిదు= కొంచెము కొంచెముగా, ఎమ్మేల్ = మాపై, విళియావో = కటాక్షింపవా? తిజ్గళుమ్= చంద్రుడు, ఆదిత్తియనుమ్ = సూర్యుడును, ఎళున్దాఱ్పోల్ = ఉదయించినట్లు, అమ్= అందమైన, ఇరణ్డుమ్ కణ్ కొణ్డు = రెండు నేత్రములను గొని, ఎజ్గళ్ మేల్ = మాపై, నోక్కుదియేల్= (నీవు) కటాక్షించినచో, ఎజ్గళ్మేల్ = మాపై నున్న, శాపమ్ = దుఃఖము, ఇళిన్దు= నశించును. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

ఈ అందమైన, విశాలమైన గొప్ప భూమండలములోని ప్రభువులందఱు దురభిమానము నశింపగా వచ్చి, నీ సింహాసనమునకు క్రింద గుంపులు గుంపులుగా చేరియున్న విధమున మేము నిన్ను చేరితిమి. చిన్ని మువ్వలవలె కొంచెము తెఱుచుకొనినవి, తామర పూవులవలె ఎఱ్ఱనివి అగు నీ కన్నులతో మమ్ములను కటాక్షింపుము. స్వామి! సూర్య చంద్రులు ఉదయించినట్లున్న, అందమైన నీ కన్నులతో మమ్ములను నీవు కటాక్షించి నచో మా దుఃఖము అంతయు తొలుగగలదు.

ఇందు, అభిమానము – అహంకారమమకారములు, శిఱుచ్చిఱుదు విళి (మెల్లగా మెల్లగా చూచుట స్వస్వాతంత్ర్యము) – క్రమముగా దేహాత్మాభిమానము, మొదలగు వానిని నశింపచేసికొనుట, శాపమ్ – భగవద్విశ్లేషమువలన కల్గిన దుఃఖము – అని స్వాపదేశార్థములు.

**ఇరువదిమూడవ పాశురము** : శ్రీకృష్ణుడు గోపికలను ఊరడించి, సమాధాన పఱుపగా, వారు తమ కార్యమును సఫలము చేయవలెనని ఇందు ప్రార్థించు చున్నారు.

**23. మారి మలై ముళఙ్జిల్ మన్ని క్కిడన్దుఉఱఙ్గుమ్**
**శీరియ శిఙ్గమ్ అఱివుట్రు త్తీ విళిత్తు**
**వేరిమయిర్ పొఙ్గ ఎప్పాడుమ్ పేర్న్దుదఱి**
**మూరి నిమిర్న్దు ముళఙ్గి ప్పుఱప్పట్టు**
**పోదరుమాపోలే నీ పూవైప్పూవణ్ణా! ఉన్**
**కోయిల్ నిన్ఱు ఇఙ్గనే పోన్దరుళి కోప్పుడైయ**
**శీరియ శిఙ్గాశనత్తిరున్దు యామ్ వన్ద**
**కారియమ్ ఆరాయ్ న్దు అరుళ్ ఏలోర్ ఎమ్బావాయ్**

మారి = వర్షాకాలములో, మలై ముళఙ్జిల్ = కొండగుహలో, మన్ని = అమరియుండి, కిడన్దు = పరుండి, ఉఱఙ్గుమ్ = నిద్రించు, శీరియ = పరాక్రమ సంపత్తును కల, శిఙ్గమ్ = సింహము, అఱివు ఉట్రు = తెలివిని పొంది (నిద్ర లేచి), తీ = అగ్నికణ ములు వెదజల్లునట్లు, విళిత్తు = చూచి, వేరి మయిర్ = జాత్యుచితమైన పరిమళమును కల సటలు, పొఙ్గ = పొంగునట్లు (నిక్కబొడుచు కొనునట్లు), ఎప్పాడుమ్ = అన్ని వైపుల, పేర్న్దు = లేచి, శరీరమును కదలించి, ఉదఱి = దుమ్ము దులుపుకొని, మూరి నిమిర్న్దు = శరీరమును సాగదీసికొని, ముళఙ్గి = గర్జించి, పుఱప్పట్టు = గుహనుండి నిర్గమించి, పోదరుమాపోలే = వచ్చునట్లు, పూవై పూ = నల్లని అతసీపుష్పమువంటి, వణ్ణా = మేని వన్నెను కలవాడా!, నీ = నీవు, ఉన్ = నీ, కోయిల్ నిన్ఱు = భవనమునుండి, ఇఙ్గనే = ఇట్లు, పోన్దరుళి = వేంచేసి, కోప్పుడైయ = జయప్రదమైన, శీరియ = గొప్పదైన, శిఙ్గాశన త్తిరున్దు = సింహాసనములో వేంచేసియుండి, యామ్ = మేము, వన్ద = వచ్చిన, కారియమ్= పనిని, ఆరాయ్న్దు = విచారించి, అరుళ్ = అనుగ్రహింపుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).



అతసీసుమవర్ణా! శ్రీకృష్ణా! వర్షాకాలములో కొండగుహలో సుఖముగా నిద్రించు వీరసింహము నిద్ర లేచి, నిప్పుకణములు వెదజల్లునట్లు తీక్ష్ణముగా చూచి, సటలను విదలించుకొని, పైకి లేచి, శరీరమును సాగదీసికొని, గర్జించి, గుహనుండి బయటకు వచ్చు రీతిలో, నీవును నీ శయ్యాగృహమునుండి బయటకు వచ్చి, సభామండపములో విచిత్రమైన గొప్పదైన, సింహాసనములో వేంచేసియుండి మేము వచ్చిన ప్రయోజనమును గమనించి అనుగ్రహింపుము.

ఇందు, మలై ముళఙ్జు అనగా ఉపనిషద్భాగము, పుఱప్పట్టు (బయటకు వచ్చి) – అనగా ప్రకృతి సంబంధమునుండి బయటపడి అని అర్థము. ఇచట గుహలోని సింహము నిద్రనుండి లేచి వచ్చుట – భగవానుడు జగత్సృష్టిని చేయుటకు సంకేతము.

**ఇరువదినాల్గవ పాశురము** : గోపికలు అపేక్షించిన రీతిలోనే శ్రీకృష్ణుడు శయ్యాగృహమునుండి బయలు దేరి, సభామండపమువైపు నడువసాగెను. స్వామి నడక హొయలును చూచిన గోపికలు, ఆ అందమునకేమి కీడు మూడునో? అని అస్థానే భయశంకతో ఈ పాశురములో మంగళమును పాడుచున్నారు.

**24. అన్ఱివ్వులకమ్ అళన్దాయ్! అడి పోట్రి**
**శెన్ఱఙ్గు త్తెన్నిలఙ్గై శెట్రాయ్! తిఱల్ పోట్రి**
**పొన్ఱ చ్చకడముదైత్తాయ్! పుకళ్ పోట్రి**
**కన్ఱు కుణిలా ఎఱిన్దాయ్! కళల్ పోట్రి**
**కున్ఱు కుడైయా ఎడుత్తాయ్ కుణమ్ పోట్రి**
**వెన్ఱు పకై కెడుక్కుమ్ నిన్ కైయిల్ వేల్ పోట్రి**
**ఎన్ఱెన్ఱు ఉన్ శేవకమే ఏత్తి ప్పఱైకొళ్వాన్**
**ఇన్ఱు యామ్ వన్దోమ్ ఇరఙ్గు ఏలోర్ ఎమ్బావాయ్**

అన్ఱు=అపుడు (వామనావతారమున), ఇవ్వులకమ్ = ఈ లోకమును, అళన్దాయ్= కొలిచినవాడా! అడి = (నీ) పాదములకు, పోట్రి = మంగళము, అఙ్గు = అచటికి (రావణుడున్నచోటికి), శెన్ఱు = వెడలి, తెన్ ఇలఙ్గై = అందమైన లంకను, శెట్రాయ్ =

నశింపచేసినవాడా!, తిఱల్ = (నీ) బలమునకు, పోట్రి= మంగళము, శకడమ్ = శకటరూపములోని అసురుని, పొన్ద = (అతడు) నశించునట్లు, ఉదైత్తాయ్ = తన్నినవాడా!, పుకళ్= (నీ) కీర్తికి, పోట్రి = మంగళము, కన్రు = వత్సరూపములోనున్న అసురుని, కుణిలా = దండమువలె, ఎఱిన్దాయ్ = విసరికొట్టినవాడా!, కళల్ = (నీ) పాదములకు, పోట్రి = మంగళము, కున్రు = గోవర్ధనపర్వతమును, కుడైయా = ఛత్రముగా, ఎడుత్తాయ్ = ఎత్తినవాడా!, కుణమ్= (నీ) దయాగుణమునకు, పోట్రి = మంగళము, పకై = శత్రువులను, వెన్రు = జయించి, కెడుక్కుమ్ = నశింపచేయు, నిన్=నీయొక్క కైయిల్=చేతిలోని, వేల్=వేలాయుధమునకు, పోట్రి = మంగళము,ఎన్రు ఎన్రు = అని ఇట్లు, ఉన్ శేవకమ్ = నీ వీరకృత్యములను, ఏత్తి = కీర్తించి,పఱై కొళ్వాన్ = వాద్యమున తీసికొనుటకై (నీ సేవను చేయుటకై), యామ్ = మేము, ఇన్రు= ఇపుడు, వన్దోమ్ = వచ్చితిమి, ఇరఙ్గు = అనుగ్రహింపుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్)

వామనావతారకాలమున ఈ లోకమునంతటిని కొలిచినవాడా! నీ శ్రీపాదములకు మంగళము. రావణుడు నివసించు లంకకు వెడలి, ఆ నగరమును నశింపచేసినవాడా! నీ బలమునకు మంగళము. శకటాసురుడు నశించునట్లు కాలితో తన్నినవాడా! నీ కీర్తికి మంగళము. వత్సాసురుని కఱ్ఱగా చేసి విసరినవాడా! నీ శ్రీపాదములకు మంగళము. గోవర్ధన పర్వతమును గొడుగుగా ఎత్తినవాడా! నీ దయాగుణమునకు మంగళము. శత్రువులను జయించి, వారిని మట్టుబెట్టు నీ చేతిలోని వేలాయుధమునకు మంగళము – అని ఇట్లు నీ వీరచరితలకు మంగళము పాడి, వ్రతాంగమగు వాద్యమును నీవలన పొంది, ఆ పిమ్మట నీ సేవను చేసికొనుటకై ఇపుడు ఇచటకు వచ్చితిమి. స్వామీ! కృప జేయుము.

ఇందు, లంక అనగా ప్రకృతి, శకటము–కామక్రోధములు, దేహమును, గోవర్ధన పర్వతము – వైదికవిషయాసక్తి, కన్రు – లోభము, పకై – ప్రాప్యవిరోధి – అని స్వాప దేశార్థములు.

**ఇరువదియైదవ పాశురము** : శ్రీకృష్ణుడు గోపికలను ఉద్దేశించి “మీ అపేక్షిత మేది?” అని ప్రశ్నింపగా, “ఏదైన ప్రతిబంధకమున్నచో దానిని నీవే పోగొట్టి, మా దుః ఖములన్నియు నశించునట్లు అనుగ్రహింపవలె”నని ఈ పాశురములో ప్రార్థించుచున్నారు.

**25. ఒరుత్తి మకనాయ్ ప్పిఱన్దు ఓరిరవిల్**
**ఒరుత్తి మకనాయ్ ఒళిత్తు వళర**
**తరిక్కిలానాకి త్తాన్ తీఙ్గు నినైన్ద**
**కరుత్తై ప్పిళైప్పిత్తు క్కఞ్జన్ వయిట్రిల్**



**నెరుప్పెన్న నిన్ర నెడుమాలే! ఉన్నై**
**అరుత్తిత్తు వన్దోమ్, పఱై తరుతియాకిల్**
**తిరుత్తక్క శెల్వముమ్ శేవకముమ్ యామ్ పాడి**
**వరుత్తముమ్ తీర్న్దు మకిళ్న్దు ఏలోర్ ఎమ్బావాయ్**

ఒరుత్తి = ఒకతెను(దేవకీదేవికి), మకనాయ్ = పుత్రుడై, పిఱన్దు = అవతరించి, ఓర్ ఇరవిల్ = అద్వితీయమైన ఒక రాత్రిలో, ఒరుత్తి = ఒకతెకు(యశోదకు), మకనాయ్ = పుత్రుడై, ఒళిత్తు=దాగి, వళర = వర్ధిల్లగా, తాన్ = తాను, తరిక్కిలాన్ ఆకి = ఓర్వలేని వాడై, తీఙ్గు = చెడ్డను (హానిని), నినైన్ద = తలచిన, కఞ్జన్ = కంసుని, కరుత్తై = అభి ప్రాయమును, పిళైప్పిత్తు = నిష్ఫలము గావించి, వయిట్రిల్= (ఆ కంసుని) కడుపులో, నెరుప్పు ఎన్న = నిప్పువలె, నిన్ర = నిలచిన, నెడుమాలే= ఆశ్రిత వ్యాముగ్ధుడా! (సర్వాధి కుడా!), ఉన్నై = నిన్ను, అరుత్తిత్తు = (పరమ పురుషార్థమును) ప్రార్థించి, వన్దోమ్ = వచ్చితిమి, పఱై = వాద్యమును, తరుతియాకిల్= అనుగ్రహించినచో, తిరు త్తక్క = లక్ష్మికి తగిన (లక్ష్మియు ఆశపడతగిన), శెల్వముమ్ = (నీ) సంపదను, శేవకముమ్ = పరాక్రమమును, యామ్ = మేము, పాడి = గానముచేసి, వరుత్తముమ్ = వ్యసనము, తీర్న్దు = పోయి, మకిళ్న్దు = సంతోషించెదము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

ఒకనాటి రాత్రియందు దేవకీదేవికి పుత్రుడవై అవతరించిన నీవు, అద్వితీయమైన ఆ రాత్రిలోనే యశోదకు పుత్రుడవైనావు. రహస్యముగా రేపల్లెలో నీవు పెరుగు చుండుటను చూచి ఓర్వలేని కంసుడు నిన్ను వధించుటకై చేసిన ప్రయత్నముల నన్నింటిని నీవు నిర్వీర్యము కావించినావు. ఆ కంసుని కడుపులో నిప్పువలె బాధాకరుడవై నిలచినావు. సర్వాధికుడవైన ఓ స్వామీ! నీవలన మేము పరమపురుషార్థమును పొందగోరి వచ్చితిమి. నీవు వాద్యమును (నీ కైంకర్యమును) దయచేసినచో, లక్ష్మీదేవి సైతము ఆశపడతగిన నీ సంపదను, నీ వీరకృత్యములను మా నోరార పాడి, మా మనస్సులలో గల ఆర్తి తీరగా ఆనందించెదము.

ఈ పాశురములోని మొదటి ఒరుత్తి అనుటకు – అష్టాక్షరి అని, రెండవ ఒరుత్తి అనుటకు ద్వాదశాక్షరి అని అర్థము. అట్లే, కఞ్జన్ (కంసుడు) – అహంకారము, వరుత్త – విశ్లేషవ్యసనము, తరిక్కిలానాకి – భగవానుని సత్తను సహింపలేనివాడై అని స్వాపదేశములు.

**ఇరువదియాఱవ పాశురము :** మీరు చేయు వ్రతమునకు ఏమి కావలయునని శ్రీకృష్ణుడు ప్రశ్నింపగా, గోపికలు తమ మార్గశీర్ష వ్రతమునకు కావలసిన ఉపకరణములను ఇందు ప్రార్థించుచున్నారు. గోపికలు కృష్ణసంశ్లేషమునేకదా అపేక్షించిరి! ఈ ఉపకరణములను ఎందువలన కోఱు చున్నారు? అనినచో, శ్రీకృష్ణుని శుభనామము లను తాము స్తుతించుటకు, అతనిని దర్శించుటకు కారణమగు మార్గశీర్ష వ్రతమును ప్రస్తావించిన (తలపెట్టిన) యాదవులపట్ల ఉపకారస్మృతిగా ఈ ఉపకరణములను గోపికలు కోఱుచున్నారు.

**26. మాలే! మణివణ్ణా! మార్గళి నీరాడువాన్**
**మేలైయార్ శెయ్వనకళ్ వేణ్డువన కేట్టియేల్**
**ఞాలత్తై ఎల్లామ్ నడుఙ్గ మురల్వన**
**పాలన్న వణ్ణత్తు ఉన్ పాఞ్జశన్నియమే**
**పోల్వన శఙ్గఙ్గళ్ పోయ్ప్పాడుడై యనవే**
**శాల ప్పెరుమ్ పఱైయే పల్లాణ్డు ఇశైప్పారే**
**కోలవిళక్కే కొడియే వితానమే**
**ఆలినిలైయాయ్! అరుళ్ ఏలోర్ ఎమ్బావాయ్**

మాలే = ఆశ్రితులపట్ల వ్యామోహమును కలవాడా!, మణివణ్ణా! = నీలమణి వర్ణుడా!, ఆలిన్ ఇలైయాయ్ = వటదళమందు పవళించినవాడా!, మార్గళి= మార్గశిర మాసమందు, నీరాడువాన్ = స్నానము చేయుటకొఱకు, మేలైయార్ = పెద్దలు, శెయ్వనకళ్ = చేయునవి, వేణ్డువన = (కావుననే) మాకు కావలసినవియు అగు ఉపకరణములను, కేట్టియేల్ = ప్రశ్నించితివేని (తెలిపెదము వినుము), ఞాలత్తై ఎల్లామ్= భూమండల మంతయు, నడుఙ్గ = భయపడునట్లు, మురల్వన= శబ్దము చేయునవి, పాల్ అన్న = పాలవంటి, వణ్ణమ్ = రంగును కల్గినది అగు, ఉన్ = నీ, పాఞ్జశన్నియమ్ పోల్వన = పాంచజన్య శంఖముతో సాటి వచ్చు, శఙ్గఙ్గళ్ = శంఖములను, పోయ్ = మిక్కిలి, పాడుడైయ = విశాలములైన, శాల= మిక్కిలి, పెరుమ్ = పెద్ద, పఱైయే = వాద్యమును, పల్లాణ్డు = మంగళా శాసనమును, ఇశైప్పారే = పాడువారిని, కోల విళక్కే = మంగళదీపమును, కొడియే= ధ్వజమును, వితానమే = మేల్కట్టును, అరుళ్ = అనుగ్రహింపుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

ఆశ్రిత వ్యామోహమును కలవాడా! నీలమణివర్ణా! వటపత్రశాయీ! శ్రీకృష్ణా! మార్గశీర్ష వ్రతాంగముగా స్నానము చేయుట కొఱకు పెద్దలు ఆచరించు పద్ధతిలో



నడచుకొన మేము అపేక్షించు ఉపకరణములు ఏవియో తెల్పెదము వినుము. ఈ భూమి అంతయు భయపడునట్లు శబ్దించునవి, పాలవలె తెల్లనివి, నీ పాంచజన్యముతో తులతూగునవి అగు శంఖములు అనేకములు కావలెను. మఱియు, మిక్కిలి పెద్ద వాద్యమును, మంగళాశాసనమును చేయువారిని, మంగళదీపమును, ధ్వజమును, వితానమునుకూడ మాకు కృపచేయుము!

ఇందు ప్రస్తావింపబడిన శఙ్గఙ్గళ్ (శంఖములు) అనగా – అనన్యార్హశేషత్వ జ్ఞానము, పెరుమ్ పఱై – పారతంత్ర్యజ్ఞానము, పల్లాణ్డు ఇశైప్పార్ – సాత్త్విక సహవాసము, విళక్కు – భాగవతశేషత్వజ్ఞానము, కొడి – కైంకర్యము, వితానము– భోక్తృత్వనివృత్తి, మార్గళి నీరాట్టమ్ – భగవానుని అనుభవము – అని స్వాపదేశార్థములు.

**ఇరువదియేడవ పాశురము :** మార్గశీర్షవ్రతమును ఆచరించి, తాము పొందగోరిన పరమపురుషార్థమును గోపికలు ఈ పాశురములో తెలుపుచున్నారు.

**27. కూడారై వెల్లుమ్ శీర్ గ్కోవిన్దా! ఉన్దన్నై**
**ప్పాడి ప్పఱై కొణ్డు యామ్ పెఱు శమ్మానమ్**
**నాడు పుకళుమ్ పరిశినాల్ నన్ఱాక**
**శూడకమే తోళ్వళైయే తోడే శెవిప్పూవే**
**పాడకమే ఎన్ఱనైయ పల్ కలనుమ్ యామణివోమ్**
**ఆడై యుడుప్పోమ్ అదన్ పిన్నే పాల్ శోఱు**
**మూడ నెయ్ పెయ్దు ముళఙ్గై వళివార**
**కూడి యిరున్దు కుళిర్న్దు ఏలోర్ ఎమ్బావాయ్**

కూడారై = తనతో కూడని (ఆశ్రయింపని) వారిని, వెల్లుమ్ = జయించు, శీర్= గుణములను కల, గోవిన్దా = గోవిందా!, ఉన్దన్నై = నిన్ను, పాడి = కీర్తించి, పఱై కొణ్డు= వాద్యమును పొంది, యామ్ = మేము, పెఱు = పొందు, శమ్మానమ్= సమ్మానము (ఏమనగా), నాడు = లోకులు, పుకళుమ్ = పొగడు, పరిశినాల్ = బహుమానముతో, నన్ఱాక = బాగుగా, శూడకమే = కంకణములను, తోళ్ వళైయే= అంగదములను, తోడే = చెవి కమ్మలను, శెవి ప్పూవే = చెవి పూవులను (కర్ణ పుష్పములను), పాడకమే = పాదముల ఆభరణములను, ఎన్ఱు అనైయ = అని అన్ని, పల్= పలు, కలనుమ్ = ఆభరణము లను, యామ్ = మేము, అణివోమ్ = అలంకరించుకొందుము, ఆడై = వస్త్రములను, ఉడుప్పోమ్=కట్టుకొందుము, అదన్

పిన్నే = దానికి పిదప, పాల్ శోఱు= క్షీరాన్నమును, మూడ = కప్పునట్లు, నెయ్ పెయ్దు = నేతిని పోసి, ముళఙ్గై = మోచేతి, వళి వార = దారిగుండా (నేయి) కారగా, కూడి ఇరున్దు = నీతో కలసి యుండి, కుళిర్న్దు = (వియోగవ్యసనము తీరగా) చల్లదనము పొంది భుజింతుము. (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

నిన్ను ఆశ్రయింపనివారిని సైతము లోబరుచుకొను కళ్యాణగుణములను కల గోవిందా! నిన్ను స్తుతించి, వ్రతాంగమగు వాద్యమును సంపాదించి, పిదప మేము పొందునట్టి సమ్మానమును గూర్చి తెల్పెదము. వినుము. లోకములోని వారందఱు కీర్తించు తీరులో చక్కగా ముంజేతి కంకణములు, అంగదములు, చెవికమ్మలు, కర్ణపుష్ప ములు, పాదకటకములు మొదలగు పలు ఆభరణములను దాల్చి, నూతన వస్త్రములను కట్టు కొందుము. పిమ్మట క్షీరాన్నము మునుగునట్లు నేతిని పోసి, ఆ ప్రసాదము చేతిలో పెట్టుకొనగా, అందలి నేయి మోజేతుల ద్వారా కారుచుండగా నీతో కలసి మనస్సున చల్లబడినవారమై భుజింతుము.

ఇందు, కూడార్ అనగా - సన్మార్గమును అనుసరింపనివారు, శూడకమ్ - ముంచేతి కంకణము (రక్షాబంధము), తోళ్ వళై - చక్రాంకనము, తోడు - అష్టాక్షరి, శెవిప్పూ- ద్వయము, పాడకమ్ - పాదములను కల చరమశ్లోకము, ఆడై(వస్త్రము) - శేషత్వ జ్ఞానము, పాల్ శోఱు - భగవత్కైంకర్యము, నెయ్ - పారతంత్ర్యజ్ఞానము, పల్ కలనుమ్- పలు విధములైన జ్ఞానభక్తివైరాగ్యములు - అని స్వాపదేశార్థములు.

**ఇరువదిఎనిమిదవ పాశురము** : మొదటి పాశురములో **"నారాయణనే నమక్కే పఱై తరువాన్"** అనుచు తెల్పిన ప్రాప్యప్రాపకములు ఈ పాశురములో, తరువాతి పాశురములో వివరింపబడుచున్నవి. స్వామీ! "లోక సమ్మతికొఱకు మేము ఈ వ్రతమును నెపముగా పెట్టుకొంటిమే కాని, మేము పొందగోరిన పురుషార్థము నీ పాదసేవయే" అనుచు ఇందు ప్రాప్యనిష్కర్షను గోపికలు చేయుచున్నారు.

**28. కఱవైకళ్ పిన్ శెన్ఱు కానమ్ శేర్న్దుణ్బోమ్**
**అఱివొన్ఱు మిల్లాద అయ్కులత్తు ఉన్ఱన్నై**
**ప్పిఱవి ప్పెఱున్దనై పుణ్ణియమ్ యాముడైయోమ్**
**కుఱైవొన్ఱుమ్ ఇల్లాద గోవిన్దా! ఉన్దన్నోడు**
**ఉఱవేల్ నమక్కిఙ్గు ఒళిక్క ఒళియాదు**
**అఱియాద పిళ్ళైగళోమ్, అన్బినాల్ ఉన్ఱన్నై**



**చ్చిఱుపేర్ అళైత్తనవుమ్ శీఱి యరుళాదే**
**ఇఱైవా! నీ తారాయ్ పఱై ఏలోర్ ఎమ్బావాయ్**

కఱవైకళ్ = ఆవుల, పిన్ శెన్ఱు = వెనుక పోయి, కానమ్ = అడవిని, శేర్న్దు= చేరి, ఉణ్బోమ్ = భుజింతుము, అఱివు ఒన్ఱుమ్ = జ్ఞానమేమియును, ఇల్లాద = లేని, ఆయ్ క్కులత్తు = గొల్లకులములో (పుట్టిన), నామ్ = మేము, ఉన్దన్నై = నిన్ను, పిఱవి పెఱున్దనై = మా కులములో జన్మించినవాడవైనట్టి, పుణ్ణియమ్ = పుణ్యమును, ఉడైయోమ్= కల్గినవారమైతిమి, కుఱైవు ఒన్ఱుమ్ = ఏ విధమైన కొఱతయు, ఇల్లాద = లేని, గోవిన్దా = గోవిందా!, ఇఱైవా = స్వామీ!, ఉన్దన్నోడు= నీతో (గల), ఉఱవు= సంబంధము, ఇఙ్గు = ఇచట, నమక్కు = మనకు, ఒళిక్క= విడువ, ఒళియాదు = వీలు కాదు, అఱియాద = తెలియని (లోక జ్ఞానములేని), పిళ్ళైకళోమ్ = బాలికలము, ఉన్ఱన్నై = నిన్ను, అన్బినాల్ = ప్రీతివలన, శిఱు పేర్= చిన్నమాటలతో, అళైత్తన = పిలుచుటను గూర్చి, శీఱి అరుళాదే = కోపగించుకొనక, నీ = నీవు, పఱై = వాద్యమును (అపేక్షితమును), తారాయ్ = ఇమ్ము (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

ఎట్టి కొఱతయులేని గోవిందా! మా స్వామీ! మేము ఆవుల వెనుకనే పోయి, అడవిని చేరి, అచట భుజించువారము. ఎట్టి జ్ఞానము లేని గొల్లకులమందు పుట్టిన వారము. కాని, నీవు మాకు సజాతీయుడవై అవతరించిన పుణ్యమును పొందితిమి. నీతో మాకున్న సంబంధము నిత్యము. విడుచుటకు మనకు ఏ విధముగను వీలు కానిది. లోకజ్ఞానము లేని మేము నిన్ను తక్కువజేసి మాటలాడితిమి. మా హీనోక్తులకు నీవు కోపగింపకుము. మా వ్రతమునకు అవసరమైన వాద్యమును ఇచ్చి అనుగ్రహింపుము.

ఇందు తెలుపబడిన - కఱవైకళ్ - అనగా సంసారులు, కానమ్ - సంసారుల నివాసస్థానము, ఆయ్క్కులమ్ - భగవానుడే ఉపాయమని తలచు ప్రపన్నకులము, అఱివు-ఉపాయాంతరజ్ఞానము, కుఱై ఒన్ఱుమ్ ఇల్లాద - ఏ కొఱత లేకుండుట, అనగా- అవాప్తసమస్తకామత్వము, ఉఱవు - నవవిధసంబంధము - అని స్వాప దేశార్థములు.

**ఇరువదితొమ్మిదవ పాశురము** : ఈ పాశురములో గోపికలు ప్రాప్యమగు భగవత్కైంకర్యమందు తమకు గల రుచిని, ప్రాప్యస్వరూపమును, అట్టి ప్రాప్యమును అనుగ్రహించువాడు భగవానుడే అనియు తెలుపుచున్నారు.

**29. శిట్రమ్ శిఱుకాలే వన్దు ఉన్నై చ్చేవిత్తు, ఉన్**
**పొట్రామరై యడియే పోట్రుమ్ పొరుళ్ కేళాయ్!**
**పెట్రమ్ మేయ్త్తుణ్ణుమ్ కులత్తిల్ పిఱన్ద నీ**
**కుట్రేవల్ ఎజ్గళై క్కొళ్ళామల్ పోకాదు**
**ఇట్రైప్పఱై కొళ్వా నన్టు కాణ్ గోవిందా!**
**ఎట్రైక్కు మేళేళు పిఱవిక్కుమ్ ఉన్దన్నోడు**
**ఉట్రోమే యావో మునక్కే నామ్ ఆట్చెయ్వోమ్**
**మట్రై నమ్ కామజ్గళ్ మాట్రు ఏలోర్ ఎమ్బావాయ్**

శిట్రమ్ శిఱు కాలే = మిక్కిలి ప్రాతఃకాలమున, వన్దు = వచ్చి, ఉన్నై = నిన్ను, శేవిత్తు = సేవించి, ఉన్ = నీ, పొన్ తామరై = అందమైన తామరపూవువంటి, అడియే= పాదములను, పోట్రుమ్ = మంగళాశాసనమొనర్చుటలో గల, పొరుళ్= ప్రయోజన మును, కేళాయ్ = వినుము, పెట్రమ్ = పశువులను, మేయ్త్తు = మేపి, ఉణ్ణుమ్ = (పిమ్మట) భుజించు, కులత్తిల్ = (గోపాలుర) కులములో,పిఱన్ద= జన్మించిన, నీ = నీవు, కుట్రేవల్ = అంతరంగ కైంకర్యములను, ఎజ్గళై = మానుండి, కొళ్ళామల్ పోకాదు = స్వీకరింపక పోరాదు, గోవిన్దా = ఓ గోవిందా!, ఇట్రై = ఇపుడు, పఱై కొళ్వాన్ అన్టు కాణ్ = ఒక ప్రయోజనమును (వాద్యమును ప్రయోజనమును) పొంది వెడలువారము కాముసుమా!, ఎట్రైక్కుమ్ = ఎన్నిటికిని, ఏళేళు పిఱవిక్కుమ్ = ఏడేడు జన్మలకును, (నీ అన్ని అవతారములలోను), ఉన్దన్నోడు= నీతో, ఉట్రోమే యావోమ్ = సంబంధమును కల్గినవారము అగుదుము, ఉనక్కే = నీకే, నామ్ = మేము, ఆళ్ శెయ్వోమ్ = కైంకర్యమును చేయుదుము, నమ్ = మాయొక్క, మట్ర= మిగిలిన, కామజ్గళ్ = కోరికలను, మాట్రు = పోగొట్టుము (ఏల్ ఓర్ ఎమ్ పావాయ్).

గోవిందా! అత్యంత ప్రాతఃకాలముననే లేచి, నిన్ను సేవించి, అందమైన తామరపూల వంటి నీ పాదములకు మంగళమును మేము పల్కుటలోని ప్రయోజనమును తెలిపెదము. వినుము. పశువులను మేపి, భుజించు గొల్లకులములో జన్మించిన నీవు గోపికలమగు మా అంతరంగకైంకర్యములను స్వీకరించియే తీరవలెను. మేము ప్రార్థించు వాద్యవిశేషము ఒక నెపము మాత్రమే! దానిని పొందినంతమాత్రముచే మేము తిరిగి వెళ్ళువారము కాము. ఇక మేము ఆశించు ప్రయోజనమేమనగా – అన్ని జన్మలలోను ఎప్పటికిని మేము నీతో విడదీయరాని సంబంధమును కల్గినవారము



కావలెను. నీకే మేము సేవ చేయుదుము.ఇంతకంటె వేఱయిన కోఱికలను మాకు లేకుండా చేయుము.

ఇందు, పెట్రమ్ మేయత్తు – అనగా స్వరక్ష్యవర్గమును రక్షించుట, కుట్రే వల్–అంతరంగ కైంకర్యము, శిట్రమ్ శిఱు కాలే – బ్రాహ్మముహూర్తము, (సత్త్వోత్తర కాలము), మట్ర నమ్కామజ్గళ్ – అభిమానదుష్టములైన అన్య ప్రయోజనములు – అని స్వాపదేశార్థ ములు.

**ముప్పదియవ పాశురము** : ప్రబంధములోని చివరిదియగు ఈ పాశురములో, ఈ తిరుప్పావై ప్రబంధమును అభ్యసించివారు లక్ష్మీదేవియొక్క, భగవానుని యొక్క అనుగ్రహము సర్వకాలము పొంది, ఆనందింతురనుచు ఫలశ్రుతి తెలుపబడు చున్నది.

**వజ్గ క్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై**
**త్తిజ్గళ్ తిరుముకత్తు చ్చేయిళైయార్ శెన్ఱిఱైఞ్జి**
**అజ్గప్పఱై కొణ్డ వాట్రై అణిపుదువై**
**ప్పైజ్గమల త్తణ్డెరియల్ పట్టర్ పిరాన్ కోదై శొన్న**
**శజ్గత్తమిళ్మాలై ముప్పదుమ్ తప్పామే**
**ఇజ్గు ఇప్పరిశురైప్పార్ ఈరిరణ్డు మాల్వరైత్తోళ్**
**శెజ్గణ్ తిరుముకత్తు చ్చెల్వ త్తిరుమాలాల్**
**ఎజ్గుమ్ తిరువరుళ్ పెట్రు ఇన్బుఱువర్ ఎమ్బావాయ్**

వజ్గమ్ = ఓడలను గల, కడల్ = సముద్రమును, కడైన్ద = చిలికిన, మాదవనై= మాధవుని, కేశవనై = కేశవుని (బ్రహ్మరుద్రాదుల నిర్వాహకుని) వద్దకు, తిజ్గళ్ = చంద్రుని వంటి, తిరు ముకత్తు = అందమైన ముఖమును కల, శేయిళైయార్ = అందమైన ఆభరణములను కల గోపికలు, శెన్టు = వెడలి, ఇఱైఞ్జి = వేడి, అజ్గు= ఆ గోకులమున, పఱై = వాద్యమును (కైంకర్యమును), కొణ్డ = పొందిన, అవ్వాట్రై= ఆ ప్రకారమును, అణి = భూమండలమునకు అలంకారమైయున్న, పుదువై = శ్రీవిల్లిపుత్తూరులోని, పై = ప్రకాశించు, కమల = తామరపూలయొక్క, తణ్ = చల్లని, తెరియల్ = మాలను కలవారగు, పట్టర్ పిరాన్ = భట్టనాథుల, కోదై = గోదాదేవి, శొన్న = చెప్పిన, శజ్గమ్ = గుంపులుగా నుండి సేవింపతగిన, తమిళ్ మాలై = ద్రావిడభాషామయమైన పాశురమాల లోని, ముప్పదుమ్ = ముప్పది పాశురములను, తప్పామే = తప్పక, ఇజ్గు = ఈ లోకము నందు, ఇప్పరిశు = ఈ ప్రకారముగా, ఉరైప్పార్

= అనుసంధించువారు, మాల్ = గొప్ప, వరై = పర్వతములవలెనున్న, ఈర్ ఇరణ్డు = నాల్గు, తోళ్ = భుజములను కలవాడు, శెమ్ కణ్ = వాత్సల్యముతో ఎఱ్ఱనైన కన్నులను కలవాడు, తిరు ముకమ్ = అందమైన ముఖమును కలవాడు, శెల్వమ్ = సంపదచే పూర్ణుడును అగు, తిరుమాలాల్= శ్రియఃపతి వలన, ఎజ్గుమ్= అంతట (అన్ని లోకములందు), తిరు అరుళ్ = గొప్ప కృపను, పెఱ్ఱు= పొంది, ఇన్బు = ఆనందమును, ఉఱువర్= పొందుదురు. (ఎమ్ పావాయ్).

ఓడలు గల క్షీరాబ్ధిని మథించిన మాధవుడు, బ్రహ్మరుద్రాదులకు నిర్వాహకుడును అగు సర్వేశ్వరునివద్దకు, చంద్రునివంటి అందమైన ముఖములను కలవారు, సుందరములైన భూషణములను కలవారగు రేపల్లెలోని గోపికలు వెడలి, మంగళాశాసనమును చేసి, వాద్యము నెపమున పరమపురుషార్థమగు కైంకర్యమును పొందిన విధమును,ఈ భూమండలమునకు ఆభరణమనదగిన శ్రీవిల్లిపుత్తూరులో నివసించువారు, శోభిల్లు తామర పూల మాలను కలవారగు భట్టనాథుల పుత్రికయైన గోదాదేవి తిరుప్పావై ప్రబంధరూపమున ముప్పది ద్రావిడ పాశురములలో కూర్చినది. వానిని అన్నిటిని తప్పక అభ్యసించువారు ఈ లోకములో గొప్ప పర్వతములవంటి నాల్గు భుజములను కలవాడు, భక్తవాత్సల్యము వలన ఎఱ్ఱనైన కన్నులను కలవాడు, సుందరమైన ముఖమును కలవాడు, సంపదచే పూర్ణుడు అగు శ్రియఃపతి యొక్క గొప్ప అనుగ్రహమును అన్ని లోకములయందు పొంది సుఖింతురు.

ఇందు, వఙ్గమ్ అనగా – దేహము, కడల్ – సంసారము, శేయిళై – జ్ఞాన భక్తి వైరాగ్యములు, శెల్వమ్ – ఉభయవిభూతులు (లీలావిభూతి, నిత్యవిభూతులు), ఇన్బు– బ్రహ్మానందము, కేశవుడు – భోక్తృత్వాది విరోధినివర్తకుడు – అని స్వాపదేశార్థములు.

ఈ ప్రబంధములోని ధ్వన్యర్థములు ప్రాయికముగనే తెలుపబడినవి. ఇట్టి అర్థములు ఇంకను అనేకములు ఆ యా పాశురములలోనున్నను విస్తరభీతిచే వానిని ప్రస్తావింపలేదు. అట్లే, తిరుప్పావై ప్రబంధములో పలు చోట్ల ఉపనిషదర్థములు అనుసంధింపబడినదను విషయమును వ్యాఖ్యాతలు పలుచోట్ల విశదపఱచిరి. రెండవ పాశురములోని – **"శెయ్యాదన శెయ్యోమ్"** అనునపుడు **"యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నో ఇతరాణి"** అను తైత్తిరీయ శీక్షావల్లీవాక్యార్థము, అయిదవ పాశురములోని – **"పోయ పిళైయుమ్ పుకుదరువాన్ నిన్ఱనవుమ్ తీయినిల్ తూశాకుమ్"** అనునపుడు **"తద్యథేషీకతూల మగ్నౌ ప్రోతం ప్రదూయేత ఏవంహాస్య సర్వే పాప్మానః ప్రదూయంతే"** అను ఛాందోగ్య వాక్యార్థము, 19వ పాశురము లోని **"మెత్తెన్ఱ పఞ్జశయనత్తిన్ మేలేఱి"** అనునపుడు– **"ఏవంవిత్ పాదేనాధ్యారోహతి"** అను కౌషీతక్యుపనిషద్వాక్యార్థము, 21వ పాశురములోని **"ఉలకినిల్ తోన్ఱమాయ్ నిన్ఱ"** అనునపుడు **"అజాయమానో బహుధా విజాయతే"** అను ఉపనిషద్వాక్యార్థము, 27వ పాశురములోని **"కూడి యిరున్దు"** అనునపుడు **"సోऽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చితా"** అను ఆనందవల్లీ వాక్యార్థము–ఇట్లు పలు ప్రయోగములలో పలు ఉపనిషదర్థములు అనుసంధింపబడినవి. గ్రంథవిస్తరభీతిచే వానిని పేర్కొనలేదు. తిరుప్పావై ప్రబంధములో పలు విశిష్టములైన అలంకారములు కలవు. **"కదిర్ మదియమ్ పోల్ ముకత్తాన్" "ఆళి పోల్ మిన్ని"** ఇత్యాది ప్రయోగములలో ఉపమా లంకారము, **"పణ్డొరునాళ్ .... పెరుమ్ తుయిల్తాన్ తన్దానో"** ఇత్యాదిగా ఉత్ప్రేక్ష, **"తూమణి మాడత్తు", "ఏఱ్ఱ కలఙ్గళ్"** ఇత్యాది సందర్భములలో వస్తుసమృద్ధిరూప ఉదాత్తము, **"మారి మలై ముళఞ్జిల్"** అను పాశురములో గుహలో నిద్రించు సింహము నిద్రనుండి లేచివచ్చుటను స్వాభావికముగా వర్ణించుటచే స్వభావోక్తి మొదలగు అలంకారములేకాక, **"కింకిణివాయ్చ్చెయ్దద తామరైపూప్పోలే"** అను ప్రయోగములో ఉపమితఉపమవంటి అపూర్వములైన అలంకారములును కలవు. ఈ ప్రబంధములో ఆఱవ పాశురము మొదలు 15వ పాశురమువరకు గల 10 పాశురములలో పదిమంది గోపికలు నిద్ర లేపబడిరి. ఈ పది పాశురములలో వరుసగా – సరోయోగి, మహాయోగి, భూతయోగి, భక్తిసారులు, కులశేఖరులు, భట్టనాథులు, భక్తాంఘ్రిరేణులు, ముని వాహనులు, శఠకోపులు, కలివైరిసూరి అను పదిమంది దివ్యసూరులు నిద్రలేపబడిరి– అని సాంప్రదాయిక వ్యాఖ్య. గోదాదేవికి పిమ్మట జన్మించిన భక్తాంఘ్రి రేణులు, మునివాహనులు మొదలగువారికి ఆమె ప్రబోధమును పల్కుట ఎట్లు వీలగును? అనినచో, సార్వకాలికమైన జ్ఞానమును కల గోదాదేవికి వారి జన్మనుగూర్చిన జ్ఞాన ముండుటలో ఏమి ఆశ్చర్యము? తిరుప్పావై ముప్పది పాశురములను ఆచార్య పరముగా, భగవద్రామా నుజుల పరముగా వివరింపవచ్చుననుటను మహావిద్వాన్ కంచి ప్రతివాది భయంకరం అణ్ణాస్వామివారు నిరూపించిరి. ఆ వివరములు విస్తరభీతిచే పేర్కొనుటలేదు. 6వ పాశురము నుండి 20వ పాశురము వరకు గల 15 పాశురములలో **"అస్మద్గురుభ్యో నమః"** అని ప్రారంభించి **'శ్రీధరాయ నమః'** అని పూర్తిచేయు గురుపరంపరాక్రమము సూచితమనియు పెద్దలు నిరూపించిరి. ఆ పిమ్మట 21వ పాశురము నుండి గల 10 పాశురములలో భగవానుని శరణముగా ప్రార్థించుట, మంగళాశాసనరూప కైంకర్యమును చేయుటయు తెలుపబడుటచే ద్వయమంత్రముయొక్క అర్థము అనుసంధింపబడినది. కావున తిరుప్పావై ప్రబంధములో గురుపరంపరా వివరణ పూర్వకమైన ద్వయవివరణము

కలదని తెలియుచున్నది. అట్లే, ఈ ప్రబంధమున అష్టాక్షరి, శ్రీకృష్ణచరమశ్లోకార్థములు ప్రతిపాదింపబడినవనుటయును ఆచార్యులు నిరూపించిరి. కావున ఈ ప్రబంధము రహస్య త్రయార్థవివరణాత్మకము. **"నారాయణన్"** అని పరరూపము, **"పాఱ్కడలుళ్ పైయిత్తుయిన్ర పరమన్"** అని వ్యూహము, **"ఓఙ్గి ఉలకళన్ద ఉత్తమన్"** అని విభవము, **"విత్తినై ఉళ్ళత్తు క్కొణ్డు"** ఇత్యాదిగా అంతర్యామి, **"పుళ్ళరైయన్ కోయిల్"** అని అర్చారూపము – ఇట్లు భగవానుని పరత్వాది పంచకము ఈ ప్రబంధమున ప్రస్తావింపబడినది. తొమ్మిదవ పాశురములో **"ఉన్ మకళ్తాన్ ఊమైయో, అన్రి చ్చెవిడో"** ఇత్యాది ప్రయోగములద్వారా భూమవిద్య, **"కుత్తువిళక్కెరియ"** అను 19వ పాశురములో పర్యంక విద్యయును సూచింప బడినట్లే, తిరుప్పావై ముప్పది పాశురములలో గల ఆయా విశిష్ట ప్రయోగములద్వారా 32 బ్రహ్మ విద్యలు తెలుపబడినవనియు శ్రీశ్రీశ్రీ శ్రీమన్నారాయణ పెద్దజీయర్ స్వామివారు సెలవిచ్చిరి. జీవాత్మ స్వరూప – పరమాత్మ స్వరూప – ఉపాయ స్వరూప – ఫలస్వరూప– విరోధిస్వరూపములనెడి అర్థపంచకము యొక్క వివరణముకూడ ఈ దివ్యప్రబంధములో కలదనియు పెద్దలు నిరూపించిరి. శ్రీరామా యణములో మొదటి సర్గ మిగిలిన గ్రంథమునకు సంగ్రహ మైనట్లు, శ్రీభాష్యమహాగ్రంథమునకు అందలి మంగళశ్లోకము సంగ్రహమైనట్లు, శఠకోపసూరి ప్రణీతమైన తిరువాయ్మొళి ప్రబంధమునకు అందలి మొదటి పాశురము సంగ్రహమైనట్లు ఈ ప్రబంధమునకు ఇందలి మొదటి పాశురము సంగ్రహము. తిరుప్పావైలోని ముప్పది పాశురములలో ముప్పది శ్రీవైష్ణవక్షేత్రములు సూచింపబడినవనియు కాంచీ శ్రీ ప్రతివాదిభయంకరం అణ్ణాస్వామివారు తెలియజేసిరి. ఇట్లే, యోగశాస్త్రానుగుణముగా ఇంకను పలు విధములైన వివరణలు ఈ కృతికి కలవు. ఇట్లు ఈ ప్రబంధము సకలార్థ ప్రతిపాదకముగా లోకములో వినుతి కెక్కినది. ఇట్టి అప్రమేయ వైభవమును కల గోదాదేవి రచించిన తిరుప్పావై ప్రబంధము ఆస్తికజనులకందఱకు నిత్యము అనుసంధేయముకదా!

**స్వోచ్ఛిష్టమాలికాబంధగంధబంధురజిష్ణవే ।**
**విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్ ॥**
**మాదృశాకించన త్రాణబద్ధకంకణపాణయే ।**
**విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్ ॥**

* * *